ఇవ్వబడతాయి. విదేశీ మారక ద్రవ్యం యిబ్బందివల్ల యింతవరకు బుల్ డోజర్లు ఖరీదుచేయబడలేదు. అయినప్పటికీ ఈసంవత్సరంలో 5 బుల్ డోజర్లను కొనటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 5.30 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో రైతులకుకూడ అద్దెకు తీసుకోవటానికి యివి అందుబాటులో ఉంటాయి.

# పశుగణాభివృద్ధి

## కీలక గ్రామ పథకం

పశుగణాభివృద్ధికోసం నిర్ణీత ప్రాంతాలలో తీవ్రకృషి చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ పథకం క్రింద నాసిరకం ఎద్దులకు విత్తుకొట్టడం, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల నియంత్రణ క్రింద పశు... కార్యక్రమాన్ని అమలుజరపటం, సబ్సిడీ పద్ధతిపై దూడలను పెంచడం, సహకార పద్ధతులపై పశుగ్రాస వనరులను అభివృద్ధిపరచడం జరుగుతుంది. 1957—59 సంవత్సరాలలో 10 కీలకగ్రామ కేంద్రాలు ఆంధ్రలో స్థాపించబడినాయి. ఇంకా 9 కేంద్రాలను ప్రారంభించటానికి, యిప్పుడున్న వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 11.107 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష ఒక ప్రాత కీలక గామ కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## జిల్లా, రాజ్య పశుప్రదర్శనాలు.

పశువుల పెంపకపు దార్లకు ఉత్సాహం కలిగించటానికి, శాస్త్రీయ పద్ధతులలో పశువులను పెంచడం, మేపడం, నిర్వహించడం గురించి జనసామాన్యానికి తెలియ చెప్పటానికిగాను రాజ్య, జిల్లా పశుప్రదర్శనలను ఏర్పాటు చేసేటందుకు యీ పథకం క్రింద తలపెట్టబడింది. 1959—60 లో 4 జిల్లా పశు ప్రదర్శనలను ఒక రాజ్య పశుప్రదర్శనను ఏర్పాటు చేయుటకుగాను యీ జిల్లాకు రు. 0.022 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## గొఱ్ఱెలు ఉన్ని విస్తరణ కేంద్రాలు

ఈ పథకం క్రింద అనంతపురం జిల్లాలో ఒక సూపర్‌వైజరీ యూనిట్టుతో గొఱ్ఱెలు ఉన్ని విస్తరణ కేంద్రాలు ఎనిమిది 1959—60 లో స్థాపించ బడతాయి. ఇందుకు ప్రణాళికలో రు. 1·31 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ పథకం క్రింద మేలురకం పొట్టేళ్ళు సరఫరా చేయబడతాయి. గొఱ్ఱెల కాపర్లు గొఱ్ఱెలను పెంచటంలోను మేపటంలోను శాస్త్రీయ విధానలను అవలంబించేటట్లు ప్రోత్సహించటానికి ఈ అంశాలను గురించి ప్రదర్శనా పూర్వకంగా వివరించటానికికూడ తలపెట్టబడింది.

## కోళ్ల పరిశ్రమ విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారిచే ప్రారంభించ బడిన పైలట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 12 కోళ్ల పెంపకపు విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు 1957—59 సంవత్సరాలకాలంలో ప్రారంభించ బడినాయి. 1959—60 లో యింకా 4 కేంద్రాలను ప్రారంభించటానికి, యింతకు ముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికిగాను ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 2.76 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0 052 లక్ష యీ జిల్లాలో ఒక పాత విస్తరణకేంద్రాన్ని కొనసాగించేటందుకుగాను ప్రత్యేకించ బడింది.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానిక పశుగణ స్థాయిని పెంచే ఉద్దేశంతో ఆబోతులను, దున్నపోతులను, మేకలను, పోతుపందులను, ఆడపందులను, పొట్టేళ్లను విదేశీరకం కోడిపుంజులు, పెట్టలను, గ్రుడ్లను తక్కువ ధరలకు రైతులకు రెండవ ప్రణాళికాకాలంలో పంపకం చేయటానికి ప్రతిపాదింపబడింది. తక్కువధర అంటే కొన్న ధరలోసగం ధరకు తగ్గించి యివి సరఫరా చేయబడతాయి. 1959-60 లో ఈ జిల్లాలో పంపకం చేయడానికి ఉద్దేశించ బడిన పశువుల సంఖ్య, అందుకయ్యే ఖర్చు వివరాలు క్రింద యివ్వబడినాయి.

| | | సంఖ్య | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|---|
| 1. | ఆబోతులసరఫరా | 8 | 0.084 |
| 2. | దున్నపోతులు | 10 | 0.105 |
| 3. | మేకపోతులు | 7 | 0.008 |
| 4. | ఆడమేకలు | 10 | 0.009 |
| 5. | పోతుపందులు | 5 | 0.134 |
| 6. | ఆడపందులు | 2 | 0.005 |
| 7. | పొట్టేళ్ళు | 6 | 0.009 |
| 8. | విదేశి కోడిపుంజులు | 160 | 0.019 |
| 9. | కోడిపెట్టలు | 160 | 0.019 |
| 10. | గ్రుడ్లు | 300 | 0.003 |

## ఉన్ని ప్రదర్శన యూనిట్ల ఏర్పాటు

ప్రస్తుతం అనంతపురం, నెల్లూరు, కాకినాడలలో మూడు ఉన్ని ప్రదర్శన యూనిట్లు పనిచేస్తున్నాయి. గొర్రెలను మేపటం, పెంచటం నిర్వహించటానికి సంబంధించిన విషయాలను గురించి యీ యూనిట్లు ప్రచారం చేస్తాయి. ప్రతి యూనిట్టు ఒక వెటర్నరీ అసిస్టెంటు సర్జను, ఇద్దరు స్టాక్ మెన్ల అజమాయిషీక్రింద నిర్వహింపబడుతున్నది. 1959—60 లో ప్రస్తుతమున్న మూడు యూనిట్లకు అవసరపు సిబ్బందిని నియమించటానికి సంద్యాల విజయవాడ, విశాఖపట్టణం, ఆదోని పట్టణాలలో యింకా 4 క్రొత్త యూనిట్లను ఏర్పాటు చేయటానికి, యింతేకాక అదనంగా మినిస్టీరియల్

సిబ్బందిని నియమించటంద్వారా షీప్ అండ్ గోట్ డెవలప్‌మెంట్ ఆఫీసరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.94 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.050 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## గొఱ్ఱెల పెంపకం క్షేత్రాన్ని ప్రారంభించటం

శాస్త్రీయ పద్ధతులలో మేలురకం గొఱ్ఱెలను పెంచటంకోసం గొఱ్ఱెల పెంపక క్షేత్రం ఒకటి 1958—59 లో పెనుకొండలో ప్రారంభించబడింది. ఈ క్షేత్రంలోని సిబ్బందికి వసతిగృహాలు, ఆఫీసు భవనాలు నిర్మించటానికి, పరికరాలను సరఫరా చేయటానికి, సిబ్బందిని నియమించటానికి, అదనంగా పశువులను సమకూర్చటానికిగాను 1959—60 సంవత్సరానికి రు. 1.10 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పశువైద్య శాఖ ప్రధాన కార్యాలయానికి, జిల్లా పశువైద్య కార్యాలయాలకు అదనపు సిబ్బంది నియామకం

పశువైద్య శాఖలో పని బాగా పెరిగిపోయింది. ఈ పనిని నిర్వహించటంకోసం పశువైద్యశాఖ ప్రధాన కార్యాలయంలోను, చింతలదీవిలోని ప్రభుత్వ పశుగణ క్షేత్రంతోసహా జిల్లాపశువైద్య కార్యాలయాలలోను అదనపు సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.72 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.05 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## రిండరుపెస్టు వ్యాధి నిర్మూలనా పథకం

దేశంలో రిండరుపెస్టు వ్యాధిని (గాళ్లవ్యాధిని) నిర్మూలించేటందుకుగాను భారతప్రభుత్వంవారు వ్యాధి రాకుండా నివారించేటందుకు పశువు లన్నిటికీటీకాలను వేసే కార్యక్రమం ఒకదానిని ప్రారంభించారు. ఈ టీకాలు వేసే ఉద్యమంక్రింద టీకాలు వేయబడకుండా వదలివేయబడినట్టి పశువులకు టీకాలువేసే నిమిత్తం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం,

కర్నూలు జిల్లాలకు సంబంధించి యింకొక పథకం మంజూరు చేయబడింది. రిండరుపెస్టు వ్యాధి నివారణకు కావలసిన టీకాల మందు మొదలయినవి లభ్యం కాకపోవడంవంటి కొన్ని చిక్కుల కారణంగా టీకాలువేసే కార్యక్రమం పూర్తిగాకాలేదు. ఇందువల్ల పై జిల్లాలలో యీ రెండు పథకాల్ని కొనసాగించటానికి తలపెట్టబడింది. మొదట ప్రారంభించిన పథకం కృష్ణా నదికి ఉత్తరాన ఉన్న జిల్లాల్లో ఈ సంవత్సరం పూర్తవుతుంది. అయితే ఈ జిల్లాలలోకూడా కొన్నిటికి టీకాలు వేయబడకుండా ఉండవచ్చు. అందువల్ల ఈ జిల్లాలలోకూడ ఈ రెండవ పథకాన్ని ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. ఈ పథకం అమలు జరపటంకోసం 1959—60 ప్రణాళికలో రు. 1,95 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.082 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## క్లినికల్ లేబరేటరీలను స్థాపించటం

రసాయనిక పరీక్షల ద్వారా సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయటంకోసం జిల్లా ప్రధాన పశువైద్య ఆసుపత్రులలోను, రాజ్యంలోని పశుగణాభివృద్ధి క్షేత్రాలలోను క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. 1957—58 లో విశాఖపట్టణం, కాకినాడ, నెల్లూరు చిత్తూరు, కర్నూలులలో ఉన్న ప్రధాన పశువైద్య ఆసుపత్రులలో 5 క్లినికల్ లేబరేటరీలు ఏర్పాటు చేయబడినాయి. 1959—60 లో పశ్చిమ గోదావరి, కృష్ణ, అనంతపురం జిల్లాలలో యింకా 3 క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటు చేయడానికి, యింతకుముందు ప్రారంభించబడిన పాత లేబరేటరీలను కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.39 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.24 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## సంచార పశువైద్య దళాలు, పశు ప్రథమ చికిత్సా కేంద్రాలు, చిన్నతరహా పశువైద్య శాలలు, పశువైద్య ఆసుపత్రులను ఏర్పాటు చేయటం

గ్రామీణ, పట్టణ ప్రాంతాలలోని పశువులకు వైద్య సహాయం అందచేయటానికి, అంటువ్యాధులను సమర్థవంతంగా నిరోధించటానికి యీ పథకం

ఉద్దేశించబడింది. ఈ జిల్లాలో యింతకుముందే ప్రారంభించబడిన పశువైద్య ఆసుపత్రులను, సంచార పశువైద్యవశాలను కొనసాగించటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 0 103 లక్ష కేటాయించబడింది.

### జిల్లా కోళ్ళ పెంపకం క్షేత్రాలను ప్రారంభించటం

ప్రస్తుతమున్న కోళ్ళ పెంపకం క్షేత్రాలద్వారాను ప్రయివేటు వ్యక్తుల ద్వారాను ఉత్పత్తి చేయబడుచున్న విదేశిరకం కోళ్ళ సంఖ్య చాలినంతగా ఉండకపోవడంచేతను, విదేశిరకం కోళ్ళ సరఫరాను పెంపొందించే ఉద్దేశంతోను 1959—60 లో రెండు జిల్లా కోళ్ళ పెంపకం క్షేత్రాలను ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో ఒక క్షేత్రం యీ జిల్లాలో ఏర్పాటు చేయబడుతుంది. ఇందుకుగాను రు. 0.50 లక్ష కేటాయించబడింది.

## అడవులు

### అడవుల పునరుద్ధరణ.

అటవీశాఖ వారిచే స్వాధీనం చేసికోబడినట్టి ఎస్టేటు, పంచాయితీ అడవుల ఉత్పాదక శక్తిని అభివృద్ధి చేసే ఉద్దేశంతో ఆ అడవులలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో 30 ఎకరాల ప్రదేశంలో పునరుద్ధరణ క్షేత్రాలను వేయటానికి, పాతక్షేత్రాలను నిర్వహించటానికిగాను ఈ సంవత్సరానికి రు. 0.02 లక్ష కేటాయించబడింది.

### రిజర్వు అడవులలో చెట్టు చేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

భూసారం కొట్టుకునిపోకుండా నివారించే నిమిత్తం యీ పథకంక్రింద రిజర్వు అడవులలో చెట్టు చేమ నశించిన కొండవాలులలో చెట్లువేసే పద్ధతిని అటవీ పెంపక క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో యింకా 30 ఎకరాల ప్రదేశంలో యీ అటవీ పెంపక కార్యక్రమాన్ని అమలుపరచేటందుకు, పాత క్షేత్రాలను నిర్వహించేటందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.023 లక్ష కేటాయించబడింది

### కలప రవాణా నియమావళి.

కలపను దొంగ రవాణా చేయకుండా నివారించడానికి గాను కలపను ఒక చోటనుండి మరొక చోటకు చేరవేయడం మీద కట్టుదిట్టమైన పర్యవేక్షణ జరపడానికి ఈ పథకం ఉద్దేశించ బడింది. 1959—60 లో ఆంధ్రప్రాంతపు డివిజన్లు అన్నింటిలోను 30 మంది తానాదార్లు నియమించ బడతారు. ఇందుకు ప్రణాళికలో రూ. 0.35 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఆ మొత్తంలో రూ. 0.0132 లక్ష మొత్తం ముగ్గురు తానాదార్ల నియామకానికి గాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

### భవనాల నిర్మాణం

ఈ జిల్లాలో పనిచేస్తున్న అటవీశాఖ తాబేదారీ సిబ్బందికి నివాస గృహ వసతి లేనందువల్ల యీ పథకం క్రింద రు. 0.15 లక్ష ఖర్చుతో వారికోసం ఈ సంవత్సరంలో 3 నివాస గృహాలను నిర్మించటానికి ప్రతిపాదింపబడింది.

## భూసార రక్షణ

### అనంతపురం జిల్లాలోని ఎఱ్ఱరేగడి భూములకు సంబంధించిన భూసార రక్షణ పథకం

ఈ పథకం 1954 జులై నెలలో ప్రారంభించ బడింది. అనంతపురం జిల్లాలో ఎఱ్ఱ రేగడి భూములు ఉన్న ప్రాంతాలలో వర్షాలు పడడం చాల తక్కువ. ఇక్కడి రైతులు ఆర్థికంగా చాల వెనుక బడినట్టివారు. అంతే కాక యీ భూముల ఉపరితలము తీవ్ర భూసార నష్టానికి గురి అవుతుంటుంది. ఈ కారణాల వల్ల యీ ప్రాంతాల్లో భూసార రక్షణ చర్యలు తీసికోవటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. 1958—59 లో 2,010 ఎకరాల భూమిలో గట్లు పోయబడినాయి. 1959—60 లో యింకా 3,520 ఎకరాలలో గట్లు పోయడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించ బడింది.

పది ఎకరాల క్షేత్రాలలో మెట్టసాగు పద్ధతుల్ని వివరించే పైలట్ ప్రదర్శన ప్రాజెక్టులను ఏర్పాటు చేయటం.

సొలోపు గట్లు (కాంటూరు బండ్లు) వేసిన ప్రాంతాలలో వ్యవసాయదార్లు మెట్టసాగు పద్ధతుల్ని అవలంబించేటట్లు ప్రోత్సహించే నిమిత్తం వారికి ఎకరానికి రు. 15/- లు చొప్పున సబ్సిడీ యివ్వటానికి యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. 600 ఎకరాల ప్రదేశంలో ఏర్పాటు చేయబడే 60 క్షేత్రాలలో మెట్టసాగు పద్ధతుల్ని ప్రవేశ పెట్టేటందుకు గాను 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.098 లక్ష కేటాయించ బడింది.

### రిజర్వు అడవులకు వెలుపలనున్న చెట్టుచేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

రాయలసీమ జిల్లాల్లో రిజర్వు అడవులకు వెలపలఉన్న చెట్టు చేమనశించిన కొండలమీద అడవులను పెంచటానికి యీ పథకం ఉద్దేశించబడింది. రకరకాల భూసారం వివిధ సాంద్రతలలో కొట్టుకొనిపోకుండా భూసారరక్షణ చర్యలు తీసికోవడమే యీ పథకంయొక్క లక్ష్యం. ఈ జిల్లాలో 90 ఎకరాల భూమిలో అడవులను పెంచటంకోసం ఈ సంవత్సరానికి రు. 0.175 లక్ష కేటాయించబడింది.

## మత్స్యసంవర్ధన

### అధికంగాచేపపిల్లల సేకరణ, వాటి పంపిణీ.

గోదావరి, కృష్ణానదుల్లోను, తూర్పు, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలోని డెల్టా ప్రాంతాల్లో ఉన్న నీటిపారుదల కాలువలలోను చేప పిల్లలు పుష్కలంగా లభిస్తాయి. చేపల ఉత్పత్తిని ఎక్కువ చేయుటంకోసం రాజ్యంలోని జలాశయాల్లో నిలువ చేయడానికిగాను చేప పిల్లల్ని, అందులోను త్వరగా పెరిగే రకాల్ని, పై నదులనుండి కాలువలనుండి సేకరించటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ఈ చేపలు సేకరించ బడే ప్రాంతాలనుండి నిలువ చేయబడే ప్రాంతాలకు వీటినిరవాణా చేయటంకోసం 1957—58 లో

12 వ్యానులు కొనబడినాయి. ప్రత్యేక సిబ్బందికూడ నియమించ బడింది. ప్రస్తుతమున్న సిబ్బంది సహాయంతోను, వ్యానుల సహాయంతోను 1959-60 లో 2 కోట్ల చేపపిల్లలను సేకరించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.93 లక్షలమొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.06 లక్ష యీ జిల్లాలో 5 లక్షల చేప పిల్లలను సేకరించటానికి గాను ప్రత్యేకించ బడింది.

## చేపల మార్కెట్లు

రాజ్యంలోఉన్న చేపల మార్కెట్లు చాలవరకు అపరిశుభ్రంగాను, మురికిగాను ఉన్నాయి. చేపల మార్కెట్లను నిర్మించి వాటిని పరిశుభ్రమైన స్థితిలో ఉండవలసిన బాధ్యత సామాన్యంగా స్థానికసంస్థలు, మునిసిపాలిటీలు వహించాలి. అయినప్పటికీ వాటి ఆదాయ మార్గాలు చాలా తక్కువగా ఉన్నకారణం వల్ల వీటి నిర్మాణానికి సబ్సిడీల నివ్వటం ద్వారా స్థానిక సంస్థలకు సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్దవి, 5 చిన్నవి చేపల మార్కెట్లను నిర్మించటంకోసం స్థానిక సంస్థలకు, మునిసిపాలిటీలకు సబ్సిడీల నివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 1.23 లక్షల మొత్తం కేటాయిం బడింది. ఇందులో ఒక మార్కెట్టును ఈ జిల్లాలో నిర్మించుటకు ప్రభుత్వ సహాయం లభిస్తుంది.

## మత్స్య క్షేత్రాలు

పెంపకానికి ఉపకరించే చేపలను, వివేశీరకం చేపలను నిల్వచేయటం కోసం ఈ సంవత్సరంలో 3 మత్స్య క్షేత్రాలను నిర్మించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.55 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో ఒక క్షేత్రం యీ జిల్లాలో రు. 0.50 లక్ష ఖర్చుతో నిర్మించబడుతుంది,

# సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు.

## గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘంవారు సూచించిన పద్ధతుల ననుసరించి రాజ్యంలోని

గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించటానికి, పటిష్ఠం చేయటానికి, విస్తరింప చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. సహకార శాఖలో సిబ్బందిని పెంచటంద్వారాను, సెంట్రలు బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలచే అదనంగా నియమించ బడిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను యీ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలు జరుప బడింది.

జాతీయ అభివృద్ధి మండలివారు సహకార విధానాన్ని గురించి ఒక తీర్మానాన్ని చేశారు. గ్రామీణులతో సహకార సంఘాల నిర్మాణం జరగాలని అందువారు నొక్కి వక్కాణించారు. ఈ తీర్మానాన్ని పురస్కరించుకొని ఈ సంవత్సరం పెద్ద తరహా సంఘాలను గ్రామీణ బ్యాంకులను ఏర్పాటు చేయటం నిలుపుదల చేయబడుతుంది. అయితే ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 350 చిన్న తరహా సంఘాలను ఏర్పాటుచేయటానికి, ప్రస్తుతమున్న 500 చిన్న తరహాసంఘాలను పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందువల్ల యీ సంవత్సరం అంతమయ్యేలోగా నూటికి 82 గ్రామాలు, నూటికి 38 మంది గ్రామీణ ప్రజలు సహకార సంఘాల క్రిందకు తీసుక రాబడతారు. రు. 1,020 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 100 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలుకూడ యివ్వబడతాయి. పరిపాలన శాఖనుండి ఆడిటు శాఖను విడతీయటానికి సంబంధించిన పథకాన్నికూడ ఈ సంవత్సరంలో అమలు జరపటానికి ప్రతిపాదింపబడింది. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిస్ట్రారుకూడ ప్రధాన కార్యాలయంలో నియమించబడతారు. గ్రామీణ పరపతి విస్తరణ పథకానికి సంబంధించిన పనినిమాత్రం యీయన ప్రత్యేకంగా నిర్వహిస్తారు. ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. 100 చిన్న తరహా సంఘాలు క్రొత్తగా ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 35 చిన్నతరహా సంఘాలు పటిష్ఠం చేయబడతాయి. పాత సంఘాల్లో 13,600 మంది సభ్యులు, క్రొత్త సంఘాలలో 5,000 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 80 లక్షలవరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 5 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలు యివ్వబడతాయి.

పై కార్యక్రమాన్ని అనులుజరపటంకోసం యీ జిల్లాకు రు. 81,768లు కేటాయించబడినాయి. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | చిన్న తరహా సంఘాలకు సబ్సిడీలు. | |
| | (ఎ) 1958—59 లో ప్రారంభించబడిన సంఘాలకు | 3,100 |
| | (బి) 1959—60 లో ప్రారంభించబడే సంఘాలకు | 4,200 |
| 2. | (ఎ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీలు | 13,500 |
| | (బి) గ్రామీణ బ్యాంకులకు సీనియరు ఇనస్పెక్టర్ల నియామకం క్రింద ఖర్చు | 4,100 |
| 3. | సెంట్రలు బ్యాంకులకు సబ్సిడీలు. | |
| | (ఎ) ఇంతకుముందు నియమించబడిన పాత సూపరు వైజర్లకుగాను | 5,000 |
| | (బి) 1959—60 లో నియమించబడే క్రొత్త సూపరు వైజర్లకుగాను | 1,800 |
| 4. | అదనపు సిబ్బందిక్రింద ఖర్చు | |
| | (ఎ) ప్రణాళికయొక్క మొదటి రెండు సంవత్సరాలలో పరపతి విస్తరణ కార్యక్రమానికిగాను నియమించబడిన సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లకు | 7,090 |
| | (బి) పైలట్ పథకానికిగాను సిబ్బంది నియామకం | — |
| | (సి) కో-ఆపరేటివ్ సబ్-రిజిస్ట్రార్స్‌ఫార్ క్రెడిట్ | 8,400 |
| | (డి) కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారులు (సి. డి.), టైపిస్టులు, జవానులు | 10,600 |

(ఇ) ఆడిటు శాఖను విడతీయటానికిగాను సిబ్బందికి 21,538

(ఎఫ్) డిప్యూటి రిజిస్ట్రార్ల సర్కిళ్ళు ప్రతి ఒక్క టానిలోను 1959—60 లో ఒక్కొక్క జూనియరు ఇనస్పెక్టరు నియామకానికి 2,440

మొత్తం 81,768

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

నీటి పారుదల వసతిని కల్పించడం, భూమిని సాగుక్రిందకు తీసుకురావటం మొదలయిన శాశ్వతమైన అభివృద్ధి పనులను భూములలో చేయటంకోసం యీ పథకంక్రింద 25 సంవత్సరాలలో తీర్చుకోదగ్గ దీర్ఘకాలిక ఋణాలు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులద్వారా రైతులకు యివ్వబడతాయి. రు. 12.00 లక్షలవరకు దీర్ఘకాలిక ఋణాలు ఈ సంవత్సరంలో యీజిల్లాలో యివ్వబడతాయి. ఈ సంవత్సరానికి యీ జిల్లాకు కేటాయించబడిన రు. 6,600 లు క్రింది విధంగా వినియోగించబడతాయి.

1. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమించబడిన అదనపు సూపరువైజరుల క్రింద ఖర్చు .... 2,600

2. భూమి తనఖా బ్యాంకుల పర్యవేక్షణకోసం నియమించబడే సహకార సబ్-రిజిస్ట్రార్లు, వారి జవానులక్రింద ఖర్చు 4,000

మొత్తం 6,600

## సహకార మార్కెటింగ్ అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. వ్యవసాయదారులకు, ముఖ్యంగా చిన్నరకం మధ్యరకం ఉత్పత్తిదారులకు, స్టోరేజీ, గిడ్డంగి, మార్కెటింగు సౌకర్యాలను కలిగించడం, తద్వారా వ్యవసాయోత్పత్తులకు సహకార మార్కెటింగు సౌకర్యాన్ని ఇతోధికంగా కలుగచేయడమే యీ పథకంయొక్క లక్ష్యం. వ్యవసాయోత్పత్తులమీద స్వల్పకాలిక ఋణాలుకూడ రైతులకు యివ్వబడతాయి. ఇంతేకాక మార్కెటింగు సంఘాలద్వారా రసాయనిక ఎరువులు, అవసరమయ్యే యితర సామాగ్రి రైతులకు సరఫరా చేయ బడతాయి. గ్రామాల స్థాయిలో పనిచేసే ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల కార్యక్రమాలకు, మండీ కేంద్రాలలో పనిచేసే మార్కెటింగు సంఘాల కార్యక్రమాలకుమధ్య సమన్వయం చేకూర్చడానికికూడ యీ పథకం ఉద్దేశించబడింది.

ఈ పథకంయొక్క పై లక్ష్యాలను సాధించడంకోసం రెండవ ప్రణాళికలో ప్రాథమిక మార్కెటింగు సంఘాలను పునర్వ్యవస్థీకరించి, పటిష్ఠం చేయటానికి ఉద్దేశించబడింది. మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులను, గ్రామాల స్థాయిలోని మండీలలో ఉప గిడ్డంగులను నిర్మించటానికి, ప్రత్తి జిన్నులు, నూనె మిల్లులు, చెరకు క్రషర్లు మొదలయిన ప్రాసెసింగు ప్లాంటులను నెలకొల్పటానికిగాను సంఘాలకు సహాయం చేయటంకోసం రాజ్య ప్రభుత్వం యీ కార్యక్రమాలలో పాల్గొంటుంది. శిక్షణ పొందిన సిబ్బంది సహాయం, ఆర్థిక సహాయంకూడ యీ సంఘాలకు యివ్వబడుతుంది. ఈ సంవత్సరంలో క్రింది కార్యక్రమం యీ జిల్లాలో అమలు జరుపబడుతుంది.

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను యివ్వటం (రూపాయలు, లక్షలలో) | 25·00 |
| 2. | మార్కెటింగు సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 2 |
| 3. | పెద్దతరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 3 |

4. నెలకొల్పబడే ప్రాసెసింగు యంత్రాలు

(సంఖ్య)

పై కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం యీ జిల్లాకు రు. 3.079 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

రూపాయలు లక్షలలో

1. ప్రాథమిక మార్కెటింగు సంఘాలకు వాటామూల ధనం క్రింద విరాళం — 1.000

2. జిల్లా మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనం క్రింద విరాళం — 0.250

3. ప్రాథమిక మార్కెటింగు సంఘాల యొక్క నిర్వాహక సిబ్బంది ఖర్చుక్రింద సబ్సిడి.

   (ఎ) గత మూడు సంవత్సరాలుగా సిబ్బందిని నియమించిన సంఘాలకు — 0.095

   (బి) 1959—60 లో సిబ్బందిని నియమించే సంఘాలకు — 0.034

4. పెద్దతరహా సంఘాలకు గిడ్డంగులు

   (ఎ) గత సంవత్సరాలలో నిర్మాణం ప్రారంభించబడిన గిడ్డంగులను పూర్తిచేయుటకు. — 0.790

   (బి) 1959—60 లో నిర్మాణం ప్రారంభించబడే క్రొత్తగిడ్డంగులకు — 0.300

5. మార్కెటింగు సంఘాలచే గిడ్డంగులనిర్మాణం.

   (ఎ) పాతగిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తిచేయుటకు — 0.110

| | |
|---|---|
| (బి) క్రొత్త గిడ్డంగుల నిర్మాణానికి | 0.500 |
| మొత్తం | 3.079 |

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు.

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకార శాఖద్వారా అమలు జరుప బడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాలను అమలు జరపడంలో తెలియవచ్చిన అనుభవాలను పరిశీలించడానికి, సూత్రవిధానాలను రూపొందించటానికి, సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏవైనాఉంటే వాటిని సరిదిద్దుకొనేటందుకు మార్గాలను సూచించడానికి యీ ప్రత్యేక విభాగం కృషి చేస్తుంది. 1957—58 లో యీ పథకం అమలు జరప బడింది. గణాంక వివరాల సేకరణ, సంకలనానికి సంబంధించిన పనిని నిర్వహించుటకుగాను జిల్లాలలో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను నియమించడం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ పథకం 1958—59 లో కొనసాగించబడింది,

జిల్లాలలో పని చేస్తున్న సిబ్బందికి సూచనలు యివ్వడానికి, వారిపై అజమాయిషీ వహించడానికిగాను 1959—60 లో రిజిస్ట్రారు కార్యాలయంలో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియనును, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, యిద్దరు జవానులతోకూడిన సిబ్బందిని నియమించడానికి, క్రొత్త సర్కిళ్లకుగాను 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలుకు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46మంది లోయరు డివిజను గుమాస్తాలను నియమించడానికి ప్రతిపాదింప బడింది, క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పరచుటకు తగిన కార్య విధానాన్ని రూపొందించటానికిగాను సహకారశాఖలో పరిశీలన, పరిశోధన ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది· మొదట యీ విభాగం కోసం ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లను, ముగ్గురు జవానులను నియమించటానికి ప్రతిపాదింప బడింది· పై కార్యక్రమాన్ని అమలు జరపడం కోసం

ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.34 లక్ష ప్రధాన కార్యాలయంలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద ప్రచారం మొదలైన వాటిక్రిందే అయ్యే ఖర్చులకుగాను ప్రత్యేకించబడింది. మిగత రు. 1.36 లక్షల మొత్తంలో రు. 6,044 లు యీ జిల్లాలో నియమించ బడే సిబ్బంది క్రింద అయ్యే ఖర్చుకుగాను ప్రత్యేకించ బడినాయి.

## సహకార సంఘాల సభ్యులు, పంచాయితీదారులు మొదలైన వారికి శిక్షణ

అఖిల భారత సహకార సంఘంద్వారా భారత ప్రభుత్వంచే ప్రారంభించబడిన పథకం పద్ధతుల్లోనే యీ పథకం కూడ రూపొందించ బడింది. సహకార సూత్రాలను గురించి, నిర్వహణా విధానంగురించి గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు రెండు మూడు రోజులపాటు, పంచాయితీ దారులకు ఒక వారం రోజులపాటు, సంఘాల నిర్వాహకులకు, జీతం చెల్లింపై పనిచేసే ఉద్యోగులకు 5 లేక 6 వారాల పాటు శిక్షణ యివ్వటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ఈ జిల్లాలో 1,000 మంది సహకార సంఘాల సభ్యులకు, 300 మంది పంచాయతీదార్లకు, 40 మంది కార్యనిర్వాహకులకు శిక్షణ యివ్వటం కోసం 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 5,856 లు కేటాయించ బడినాయి.

## సహకార వ్యవసాయం.

ఈ పథకం క్రింద భూముల్లేని వ్యవసాయ కూలీలను, సహకార వ్యవసాయ సంఘాలను స్థాపించడం ద్వారా వ్యవసాయంలో స్థిరపడేటట్టుచేసి వారికి పునరావాసం కల్పించటానికి, వాటా మూలధనం క్రింద, ఎద్దులను కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద, భూమిని వ్యవసాయ యోగ్యంగా చేసి అభివృద్ధి పరచడానికి అయ్యే ఖర్చు క్రింద, వ్యవసాయ పనిముట్లను మొదలయిన వాటిని కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద ఋణాలు, గ్రాంట్ల రూపంలో ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రు. 1.34 లక్షలు, తెలంగాణా

ప్రాంతానికి రు. 0.88 లక్ష-మొత్తం రు. 2.22 లక్షలు కేటాయించ బడినాయి. ఇందులో రు. 0.28 లక్ష సహకార వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వహించటం కోసం హెడ్ ఆఫీసులో నియమించ బడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద వినియోగించ బడుతుంది. మిగత మొత్తంలో రు. 12,000 లు యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. యీ సంవత్సరంలో యీ జిల్లాలో ఏర్పాటు చేయబడే క్రొత్త సంఘాలకు ఆర్థిక సహాయం చేయడానికి యీ డబ్బు వినియోగించబడుతుంది. ఈ జిల్లాలో 2 క్రొత్తసంఘాలు ఏర్పాటు చేయబడతాయి. 71 మంది సభ్యులు ఈ సంఘాలలో ఉంటారు. ఈ సంవత్సరంలో 356 ఎకరాల భూమి సాగుచేయబడుతుంది.

## రాజ్య గిడ్డంగి సంస్థ
## (స్టేట్ వేర్ హౌసింగ్ కార్పొరేషన్)

దేశంలో గిడ్డంగి సౌకర్యాల్ని అభివృద్ధి చేయాల్సిన ఆవశ్యకతను గురించి అనేక కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కి చెప్పాయి. పరపతి సంఘాలు, పరపతేతర సంఘాల మధ్య యివి చక్కని సారథ్యం వహించేవిగా ఉంటాయి. ఇందువల్ల భారతప్రభుత్వం వారు కేంద్ర గిడ్డంగి కార్పొరేషను నొకదాన్ని ఏర్పాటు చేశారు. ఇందు కనుగుణంగా రాజ్యగిడ్డంగి కార్పొషన్లను తమతమ రాజ్యాలలో స్థాపించ వలసిందిగా రాజ్య ప్రభుత్వాలు కోర బడినాయి. ఈ రాజ్య గిడ్డంగి కార్పొరేషనులు గిడ్డంగుల మండలి ప్రత్యక్ష పర్యవేక్షణ క్రింద పనిచేస్తాయి. గిడ్డంగులలో సరకులు నిలువచేయబడినట్లుగా యివ్వబడే రసీదులు నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్లుగా పరిగణించ బడతాయి. గిడ్డంగులలో వ్యవసాయోత్పత్తులను నిలువ చేసిన వారికి పై రసీదుల నాధారం చేసికొని బ్యాంకింగు సంస్థలు ఋణాలను యిస్తాయి. 1958—59లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఒకటి యీ రాజ్యంలో స్థాపించ బడింది. ఈకార్పొరేషను వాటా మూలధనం క్రింద రాజ్యప్రభుత్వం రు. 2.50 లక్షల మొత్తం యిచ్చింది. ఈ కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద యింకా ఎక్కువ డబ్బును సమకూర్చటంకోసం ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళికలో రు. 5 లక్షలు ఈ సంవత్సరంలో కేటాయించ బడినాయి. ఈ జిల్లాలోని రైతులకుకూడ యీ పథకం క్రింద లభ్యమయ్యే సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి.

# జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 వ సంవత్సరం మార్చి నెల అంతంనాటికి యీ జిల్లాలో 8 మొదటిదశ బ్లాకులు, 1 రెండవదశబ్లాకు, 3 సామాజికాభివృద్ధి బ్లాకులు, ఒక ప్రీ-ఎక్స్‌టెన్‌షన్ బ్లాకుఉన్నాయి. వీటి పై శాల్యం 4396.05 చదరపుమైళ్లు. జనాభా 8,84,684; ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 560. భారత ప్రభుత్వం వారి నిర్ణయానుసారం 1959 సంవత్సరం ఏప్రిల్ నెలనుండి ఏర్పాటు చేయబడే ప్రతి బ్లాకులోకూడ ప్రత్యేకంగా వ్యవసాయరంగంలో ఒక సంవత్సరంపాటు తీవ్ర కృషి (ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమము) జరిగి ఉండాలి. అదేప్రకారం యీ జిల్లాలోని రాయదుర్గం బ్లాకులో 2—10—58 నుండి ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమం మొదలు పెట్టబడింది. 2—10—58 నాటినుండి ప్రీ-ఎక్స్‌టెన్షన్ కార్యక్రమాన్ని ప్రారంభించిన బ్లాకు 2—10—59 నుండి మొదటిదశ బ్లాకుగా ప్రారంభిచబడుతుంది. ఇంతేకాక మడకసిర సామాజికాభివృద్ధి బ్లాకు 1—4—1959 తేదీనుండి రెండు రెండవదశ బ్లాకులుగా రూపొందుతుంది. 1959—60 లో యీ రాజ్యానికి 36 ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు కేటాయించబడినాయి. ఇందులో 18 బ్లాకులు 1—4—59 నాడు, మిగలినవి 2—10—1959 నాడు ప్రారంభించబడినాయి. ఇందులో తనకల్లు, కొత్తచెరువు బ్లాకులు యీ జిల్లాలో ఉన్నాయి. ఇవి వరుసగా 1—4—1959, 2—10—1959 తేదీలలో ప్రారంభించబడినాయి. ఈ విధంగా 1—4—1959 నాటికి యీ జిల్లాలో 8 మొటిదశ బ్లాకులు, 3 రెండవదశ బ్లాకులు, 2 సామాజికాభివృద్ధి బ్లాకులు, 2 ప్రీ-ఎక్స్‌టెన్షన్ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో ఋణాల పద్దుక్రింద రు. 7,89,400 లు, గ్రాంట్ల పద్దుక్రింద రు. 12,95,200లు;—మొత్తం రు. 20,84,600లు కేటాయించ బడినాయి.

1—4—1959 నాటికి యీ జిల్లాలో ఉన్న బ్లాకులను చూపే పటం ప్రక్కపుటలో యివ్వబడింది.

# పంచాయితీలను పటిష్ఠం చేయడం

## సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో జిల్లాస్థాయిలో జిల్లా పంచాయితీ ఆఫీసరును, రెవెన్యూ డివిజను స్థాయిలో డివిజనల్ పంచాయితీ ఆఫీసరును, తాలుకా స్థాయిలో బ్లాకు ప్రాంతాలను మినహాయించి డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతీలకు విస్తరణాధికార్లను నియమించడం, జిల్లాపంచాయతి ఆఫీసర్ల కార్యాలయాలలో అదనపు సిబ్బందిని నియమించడం ద్వారా 1958—59 సంవత్సరంలో పంచాయతీ పరిపాలనకు సంబంధించిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బంది వ్యవస్థ పునర్వ్యవస్థీకరించబడింది. 1959—60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.120 లక్ష ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు, రు. 0.191 లక్ష పడమర, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాల్లో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు గాను ప్రత్యేకించ బడినాయి. అదనంగా ఖర్చుపెట్టాల్సిన అవసరం ఉండే జిల్లాలకు తిరిగి పంపకం చేసే నిమిత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఆధీనంలో 0.524 లక్ష ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షలలో రు. 0.3220 లక్ష 1958—59 సంవత్సరంలో యీ జిల్లాలో నియమించబడిన అదనపుసిబ్బందిని కొనసాగించే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణ పథకం

ఈ పథకంక్రింద సామర్లకోట, రాజేంద్ర నగరులలో ఉన్న రెండు విస్తరణ శిక్షణ కేంద్రాలలో డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచాయతీలకు సంబంధించిన ఎక్స్‌టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. ఈ శిక్షణ రెండు నెలలపాటు యివ్వబడుతుంది. దఫకు 40 మంది ఆఫీసర్లకు శిక్షణ యివ్వబడుతుంది. మొత్తంమీద అన్ని వర్గాలకు చెందిన 390 మంది ఆఫీసర్లకు 1959—60 లో శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది.

ఇందుకుగాను ప్రజాళికతో రు. 2.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు చెందిన ఆఫీసర్లకుకూడ యీ పథకంక్రింద శిక్షణ యివ్వబడుతుంది.

# పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల నిర్వహణకోసం 1959—60 సంవత్సరానికి యీజిల్లాకు రు. 62.20లక్షల మొత్తం కేటాయించ బడింది. వీటి వివరాలు క్రిందయివ్వ బడినాయి:—

| వరుస సంఖ్య | ప్రాజెక్టు పేరు | 1959—60 లో కేటాయింపు. (రు. లక్షలలో) | కేటాయింపుకు కారణం | నీటిపారుదల జరిగే ప్రదేశం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1. | భైరవానితిప్ప ప్రాజెక్టు | 28.45 | వివరాలు అందుబాటులో లేవు | 1,500 |
| 2. | తుంగభద్ర ప్రాజెక్టు ఎగువ కాలువ | 33.75 | వివరాలు అందుబాటులో లేవు | వివరాలు అందుబాటులో లేవు |

# విద్యుచ్ఛక్తి

## తుంగభద్ర జల విద్యుత్ పథకం-

## తుంగభద్ర—నెల్లూరు హైడ్రో థర్మల్-పథకము.

9,000 కిలోవాట్ల శక్తిగల 2 జనరేటింగ్ యూనిట్లను ఆనకట్ట పవరు హౌస్ వద్ద, 3 యూనిట్లను హంపీ పవరు హౌసు వద్ద—మొత్తం 5 జనరేటింగ్ యూనిట్లను నెలకొల్పటానికి ప్రతిపాదింపబడగా యిందులో నాలుగుయూనిట్లు మాత్రం-రెండు యూనిట్లు ఆనకట్టు పవరు హౌసువద్ద, రెండు యూనిట్లు

హాంపీ పవరు హౌసు వద్ద 1957—58 సంవత్సరం అంతంనాటికి నెలకొల్పబడినాయి. విదేశీ మారక ద్రవ్యం లభ్యమైన వెంటనే తుంగభద్ర—నెల్లూరు హైడ్రోథర్మల్ పథకం క్రింద నెలకొల్పబడే 2 యూనిట్లతో పాటు హాంపీ పవరు హౌసువద్ద మూడవ యూనిట్టునుకూడ నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది.

ఆనకట్టవద్ద, హాంపీవద్ద పవరు స్టేషనులను పూర్తిగా అభివృద్ధి పరచే నిమిత్తం 9,000 కిలోవాట్లశక్తి ఉండే మిగత 3 యూనిట్లలో రెండింటిని ఆనకట్టపవరు హౌసు వద్ద, ఒక దానిని హాంపీ పవరు హౌసువద్ద నెలకొల్పటానికి ప్రతిపాదింప బడింది. తుంగభద్ర విద్యుచ్ఛక్తి ఉత్పత్తి కేంద్రాలలో అప్పుడప్పుడు కలిగే విద్యుదుత్పత్తి లోపాన్ని భర్తీ చేసేటందుకుగాను నెల్లూరు వద్ద 30 మెగావాట్ల థర్మల్ స్టేషను నొకదాన్ని నెలకొల్పటానికి యీ పథకం కింద ఉద్దేశించ బడింది.

పవరు స్టేషను పరికరాలకు కావలసిన విదేశీ మారక ద్రవ్యం యింకా లభ్యం కానందువల్ల యీ ప్లాంటును నెలకొల్పటానికి ఉత్తరువులు యింత వరకు యివ్వబడలేదు. రాయలసీమలో మాచ్ ఖండ్ విద్యుచ్ఛక్తిని వినియోగించేటందుకు వీలు కల్పించటంకోసం మాచ్ ఖండ్ తో కలిపేనిమిత్తం 1959—60 లో నెల్లూరు నుండి కడపకు 132 కె. వి. ట్రాన్సుమిషను లైనునువేయడానికి, కడపలో 132 కె. వి. సబ్ స్టేషనుకు సంబంధించిన పనులనుచేకొనడానికి ప్రతిపాదింప బడింది. కేటాయించ బడిన రు. 53.42 లక్షల మొత్తం.లో (రు. 5.42 లక్షల మొత్తం తుంగభద్ర జలవిద్యుత్ పథకానికి, రు. 48.00 లక్షల మొత్తం తుంగభద్ర నెల్లూరు హైడ్రోథర్మల్ పథకానికి) రు. 10.18 లక్షల మొత్తం యీ జిల్లా వాటా క్రింద ప్రత్యేకించ బడింది.

## గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయుటమేగాక నాగార్జునసాగరు ప్రాజెక్టు పనులకు, గరివిడి ఫెర్రోమాంగనీసు ఫ్యాక్టరీ మొదలయిన పెద్ద పారిశ్రామిక కేంద్రాలకు విద్యుత్ సరఫరాలను విస్తరింపచేయుటకు, రు. 10లక్షలకు మించి ఖర్చయ్యే విస్తరణ పథకాలు అనుబం

సరఫరా చేయటం జరుగుతుంది. ఆంధ్ర ప్రాంతంలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేసే నిమిత్తం 1959—60 సంవత్సరానికి రు. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 10 లక్షల మొత్తం యీ జిల్లాకు కేటాయించబడింది. 10 గ్రామాలు విద్యుతీకరింపబడతాయి.

# గ్రామీణపరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

## గుంతకల్లులో తోళ్ళ శుద్ధి కర్మాగారం

మేలురకం తోలు వస్తువులను ఉత్పత్తిచేసే ఉద్దేశంతోను, 12 మంది పనివారికి శిక్షణయిచ్చే ఉద్దేశంతోను గుంతకల్లులో తోళ్ళు శుద్ధిచేసే ఒక నమూనా కర్మాగారాన్ని నెలకొల్పేటందుకు ప్రతిపాదింపబడింది. శిక్షణ పొందేవారికి నెలకు రు. 20 లు చొప్పున స్టయిఫండు యివ్వబడుతుంది. ఈ కర్మాగారాన్ని నెలకొల్పేటందుకు శాశ్వత భవనాల నిర్మాణం సాగుతున్నది. పరికరాలకోసం ఆర్డర్లు యివ్వబడినాయి. అవి అందచేయబడుతున్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.31 లక్షల మొత్తం నిర్మాణంలో ఉన్న భవనాలను పూర్తి చేయటానికి, యంత్రాలు, పరికరాల కొనుగోలుకుగాను కేటాయించబడింది. సంవత్సరాంతంలోగా యీ కేంద్రం పనిచేయటం ప్రారంభిస్తుందని, 12 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారని ఆశించబడుతున్నది.

## గుంతకల్లులో మేజోళ్ళు మొదలయిన వస్తువులను తయారు చేసే యూనిట్టు నెలకొల్పటం

మేజోళ్లు మొదలయిన వస్తువులను తయారు చేసేటందుకు, పనివారికి శిక్షణ ఇచ్చేటందుకుగాను గుంతకల్లులో ఒక ఉత్పత్తి-శిక్షణ కేంద్రాన్ని నెలకొల్పటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.97 లక్ష మొత్తం కేటాయించబడింది. అయితే ప్రస్తుతం యీ పరిశ్రమ అంత లాభసాటిదిగా కనపించకపోవటంచేతను, యీ పరిశ్రమనుగురించి అందచేసిన పరిశీలనా నివేదికలను బట్టి యీ పరిశ్రమకు సంబంధించిన క్రొత్త

కేంద్రాలకు తగిన అవకాశాలు లేవని తెలియవచ్చినందువల్లను ప్రస్తుతానికి యీ పథకాన్ని అమలుపరచటం ఆపుచేయబడింది

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలు

ఈ పథకంక్రింద పరిశ్రమలకు రాజ్య ప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలుగా రు. 13.11 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో యివ్వబడింది. ఈ సంవత్సరంలో యింకా రు. 7 లక్షల మొత్తం పారిశ్రామికులకు ఋణాలుగా ఇవ్వబడుతుంది. ఈ జిల్లాలోని పారిశ్రామికులు కూడ ఈ పథకంవల్ల ప్రయోజనం పొందుతారు.

## పరిశ్రమలశాఖ డైరెక్టరేటును, జిల్లాలలోని సిబ్బందిని పటిష్ఠం చేయటం

రెండవ ప్రణాళికాకాలంలో ఎక్కువయిపోయిన పనిని నిర్వహించేటందుకుగాను రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 7.95 లక్షల వ్యయంతో రాజ్యస్థాయిలోను, జిల్లాస్థాయిలోను పరిశ్రమలశాఖను పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింపబడింది. మొదటి 3 సంవత్సరాలకాలంలోను అదనపు సిబ్బంది (సాంకేతిక మరియు మినిస్టీరియల్) రు. 3.45 లక్షల వ్యయంతో నియమించబడింది. ఇంతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి, ఇంకా కొంత అదనపు సిబ్బందిని నియమించటానికిగాను ఆంధ్ర ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాలు

బ్లాకుప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇం దుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయిం చబడింది.

## పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపులసరఫరా

ప్రతిపాదింపబడిన పథకాలు త్వరితంగాను సమర్థవంతంగాను అమలు పరచబడాలంటే అందుకు సంబంధించిన పరిశ్రమల శాఖాధికార్లు తరచు పర్య

వేక్షణ జరుపుతూ సాంకేతిక సహాయం అందచేస్తుండాలి. ఈ అధికార్లు త్వర త్వరగా పర్యటనలను జరిపేటందుకు వీలుగా వీరికి జీపులను సరఫరా చేయటం అవసరం. 1958—59 అంతంనాటికి ఆంధ్రలోని పరిశ్రమల వాణిజ్య శాఖ అసిస్టెంటు డైరెక్టర్లకందరికీ జీపులు యివ్వబడినాయి, ఈ జీపుల నిర్వహణకోసం ఈ సంవత్సరానికి రు. 0.30 లక్ష కేటాయించబడింది. ఇందులో ఒక జీపు యీ జిల్లాలో ఉంది.

## హస్తకళలు.

### గుంతకల్లులో వెదురు, బుట్టల అల్లకం పరిశ్రమ అభివృద్ధి చేయటం

వెదురు, బుట్టల అల్లకం పరిశ్రమ కేంద్రం ఒకటి గుంతకల్లులో పటా 10 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటంకోసం నెలకొల్పబడింది. 1958—59లో యీ కేంద్రంలో 10 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడింది. ఈ కేంద్రం సహకార సంఘంగా మార్చబడింది, శిక్షణ కార్యక్రమం యీ సంవత్సరానికి తలపెట్టబడలేదు. వాటా మూల ధనం, నిర్వహణ మూలధనం క్రింద యీ సహకార సంఘానికి ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.07 లక్ష కేటాయించబడింది.

## క్రొత్త పథకాలు.

హస్తకళలకు సంబంధించిన క్రింది పథకాలు యీ సంవత్సరంలో అమలు పరచ బడతాయి, ఆంధ్ర ప్రాంతంలోని అన్ని జిల్లాలకు కూడ యీ పథకాల క్రింద లాభం చేకూరుతుంది.

| పథకం పేరు | 1959—60 లో కేటాయింపు (రూపాయలు, లక్షలలో.) |
|---|---|
| 1. హస్తకళలలో ఉపయోగించటానికిగాను దేవాలయాలలోని డిజైనులను కాపీచేయటం. .... | 0·05 |

2. అక్కడక్కడా ఉండి ఒక సహకార సంఘం క్రిందకు తీసుకురావటానికి వీలుగా ఉండ నట్టి పనివారలకు ఋణాలు గ్రాంట్లు మంజూరు చేయటం .... 0.05

ఈ క్రింది క్రొత్త పథకాలుకూడ ఈ సంవత్సరంలో యీ జిల్లాలో అమలుపరచబడతాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | అనంతపురంలో రెండవ తరగతి సేకరణ-అమ్మకం డిపోను ఏర్పాటు చేయటం. | 0.25 |
| 2. | అనంతపురం రైల్వేస్టేషనులో హస్తకళల వస్తువులను ప్రదర్శించేటందుకుగాను షోకేసులను ఏర్పాటు చేయటం. | 0.01 |

## పట్టు పరిశ్రమ

### హిందూపురంలో "గ్రెయినేజి" ఏర్పాటు చేయటం

రాజ్యంలో పట్టుపురుగు విత్తనాలను ఉత్పత్తిచేసే ఉద్దేశంతో మల్బరి తోటలున్న రైతులకు వ్యాధిరహితమయిన పట్టుపురుగు విత్తనాలను సరఫరా చేసేటందుకు సౌకర్యాల్ని కలుగచేసే నిమిత్తం 1956—57 లో ఒక "గ్రెయినేజి" హిందూపురంలో ఏర్పాటు చేయబడింది. "గ్రెయినేజి" భవనాల నిర్మాణం 1957—58 లో పూర్తి అయింది ఆతరువాత వ్యాధిరహిత మయిన పట్టుకాయల ఉత్పత్తి ప్రారంభమయింది. 1959 మార్చి అంతానికి 63,592 వ్యాధిరహితమయిన పట్టుకాయలు ఉత్పత్తి చేయబడి రైతులకు సరఫరా చేయబడినాయి. ఈ "గ్రెయినేజి" ఈ సంవత్సరంలో రు.0.06 లక్ష వ్యయంతో కొనసాగించబడుతుంది. రు. 0.60 లక్ష విలువచేసే వ్యాధి రహితమయిన పట్టుకాయలు ఉత్పత్తి చేయబడతాయి.

## హిందూపురంలో మూల విత్తనాల క్షేత్రాన్ని ఏర్పాటు చేయటం

మిశ్రమరకం పట్టు ఉత్పత్తి కార్యక్రమానికిగాను స్థానిక మూలవిత్తనాలను, పట్టు కాయలను ఉత్పత్తి చేయటంకోసం హిందూపురంలో మల్బరీ మూలవిత్తనాల క్షేత్రమొకటి 5 ఎకరాల ప్రదేశంలో 1956—57 లో నెలకొల్పబడింది. ఈ క్షేత్రానికి నీటిపారుదల సౌకర్యం కలిగించటంకోసం 1957—58 లో ఒక బావికూడ త్రవ్వబడింది. "రేరింగుహౌసు" నిర్మాణం 1958—59 లో పూర్తి చేయబడింది. మల్బరీ తోటనువేయటంకూడా 1958—59 లో ప్రారంభించబడింది. 1959 మార్చి అంతానికి 1.88 లక్షల స్థానిక మూలవిత్తనపు పట్టుకాయలు ఉత్పత్తి చేయబడినాయి. ఈ సంవత్సరంలో యీ విత్తనాలక్షేత్రం కొనసాగించ బడుతుంది. దాదాపు 4 లక్షల పట్టుకాయలు ఉత్పత్తి చేయబడతాయి. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది.

## హిందూపురంలోను, పలమనేరులోను "రీలింగు యూనిట్లు"ను స్థాపించటం

ఈ పథకంక్రింద అనంతపురం, చిత్తూరు జిల్లాలోని పట్టుపరిశ్రమదారులకు మార్కెటింగు సౌకర్యాలు కలిగించటానికి ఉద్దేశించబడింది. ఇందుకుగాను 1957—58 లో హిందూపురంలో ఒకటి, 1958—59 లో పలమనేరులో ఒకటి మొత్తం రెండు "రీలింగుయూనిట్లు" స్థాపించబడినాయి. పట్టుపరిశ్రమదారులచే ఉత్పత్తి చేయబడిన పట్టుకాయలను అక్కడికక్కడే డబ్బు చెల్లించి కొనడానికి, ఆ కాయలనుండి పట్టు పరిశ్రమశాఖ తరపున పట్టును తీయటానికి యీ యూనిట్లు పనిచేస్తాయి. 1957—58, 58—59 సంవత్సరాలలో యీ రెండు యూనిట్లలోను 172 పౌన్లు ముడిపట్టు తీయబడింది. ఈ సంవత్సరంలో రు. 0.20 లక్ష (ప్రతి యూనిట్టుకు రు. 0.10 లక్ష చొప్పున) ప్రణాళికలో కేటాయించబడింది. ఈ యూనిట్లను కొనసాగించటానికి, 10,000 పట్టుకాయలను అనంతపురం, చిత్తూరు జిల్లాలలో ఉత్పత్తిదారులనుండి కొనటానికి పై డబ్బు వినియోగించబడుతుంది.

## హిందూపురంలో అంట్ల నర్సరీ యూనిట్టు ఏర్పాటు

ఎక్కువ పంట నిచ్చేరకం మల్బరీ అంట్లను యింకా ఎక్కువగా ఉత్పత్తి చేసి రైతులకు పంపకం చేయటమే యీ పథకంయొక్క ఉద్దేశం. ఇందుకుగాను హిందూపురంలో 10 ఎకరాల తోట వేయబడింది. అంట్లుకట్టే పనిని నిర్వహించేటందుకు అవసరమయ్యే పనిముట్లు మొదలగువాటిని ఉంచుకోవడానికిగాను యిక్కడ ఒక షెడ్డుకూడ నిర్మించబడింది. నీటి పారుదల సౌకర్యాలు కలిగించటంకోసం ఒక బావి త్రవ్వబడింది. 1957—58 లో 16,000 స్థానిక మల్బరీ మొక్కలు, 7000 బెర్హాంపూరు మొక్కలు నాటబడినాయి. అవి యిప్పుడు పెరుగుదలలో ఉన్నాయి. 1958—59 లో యీ క్షేత్రంలో 2,130 అంట్లు తయారు చేయబడినాయి. ఇంతేకాక 20,000 స్థానిక మల్బరీ మొక్కలు నాటబడినాయి. ఈ పథకాన్ని కొనసాగించటానికి, 2 లక్షల అంట్లను తయారు చేయటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.11 లక్ష కేటాయించబడింది.

## రెండు పాఠశాలలలో పట్టుపరిశ్రమను వృత్తి విద్యాగా ప్రవేశపెట్టటం

హిందూపురం దగ్గరఉన్న సేవామందిరంలోఉన్న బేసిక్ పాఠశాలలోను, చిత్తూరు జిల్లా చింతపర్తిలోని ప్రాథమికోన్నత పాఠశాలలోను 1957—58 సంవత్సరంలో పట్టు పరిశ్రమ, బేసిక్ వృత్తి విద్యగా ప్రవేశపెట్టబడింది. ప్రత్యక్ష విధానాల ద్వారా పిల్లలకు మల్బరీ వ్యవసాయాన్ని గురించి, పట్టు పురుగుల పెంపకం గురించి యిక్కడ శిక్షణ యివ్వబడుతుంది. ఈ రెండు పాఠశాలల్లో యీ వృత్తి విద్యను ఈ సంవత్సరంలో కొనసాగించేటందుకు ప్రణాళికలో రు. 0.02 లక్ష (ఒక్కొక్క పాఠశాలకు రు. 0.01 లక్ష చొప్పున) కేటాయించ బడింది.

## పట్టుపరిశ్రమ దార్లకు సాంకేతిక సహాయం

అనంతపురం జిల్లా హిందూపురం, మడకసిర తాలూకాల్లోని పట్టుపరిశ్రమ దారులకు సాంకేతిక సహాయం చేయటం కోసం 1958—59 లో యీ పథకం అమలుపరచ బడింది. 1958—59 లో అదనంగా 62 ఎకరాల భూమి

మల్బరీ తోటల క్రిందకు తీసుకురాబడింది. 1548 పౌన్ల పట్టుకాయలు ఉత్పత్తి చేయబడినాయి. 1960—61 లో యీ పథకం కొనసాగించ బడుతుంది. ఇందుకు ప్రణాళికలో రు. 0,07 లక్ష కేటాయించ బడింది. అదనంగా సుమారు 60 ఎకరాల భూమి మల్బరీ తోటల క్రిందకు తీసుకరాబడుతుందని ఆశించబడు తున్నది.

## క్రొత్త పథకాలు

### పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం

పట్టుపరిశ్రమపట్ల ప్రజలు శ్రద్ధాసక్తులు చూపేట్టు చేయటానికిగాను పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం చేయటం కోసం యీ పథకాన్ని అమలు పరచేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష కేటాయించ బడింది.

### హిందూపురంలోని ప్రభుత్వ సిల్కుఫారంకు "ఇన్‌క్యుబేటరు"ను సమకూర్చటం

హిందూపురంలోని ప్రభుత్వ సిల్కు ఫారంకు "ఇన్‌క్యుబేటరు"ను సరఫరా చేయటంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.05 లక్ష కేటాయించబడింది.

## గ్రామీణ పరిశ్రమలు

### బెల్లం, ఖాండసారీ పరిశ్రమలు.

ఈ పథకం క్రింద రైతులకు మేలు రకంపనిముట్లను కొనుక్కోవటానికిగాను వడ్డీ లేకుండా ఋణాలు యివ్వబడతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాల కాలంలో వసూలు చేయబడతాయి. ఇంతేకాక మేలురకం బెల్లం, ఖండసారీలను తయారు చేయటం గురించి ప్రదర్శన పూర్వకంగా వివరింప బడుతుంది. అనకాపల్లి, చోడవరం, రామచంద్రపురం, చిత్తూరు, హిందూపురం తాలూకాలలో యీ పథకం మొదటి పంచవర్ష ప్రణాళికాకాలంలో (1955) అమలు పరచ బడింది. ఇందుకుగాను ప్రత్యేక ఫీల్డు సిబ్బంది నియమించ బడింది. మేలురకం బెల్లం. ఖాండసారి తయారు చేయటంలో వీరు శిక్షణ పొందారు. 1957—58 లో యీపథకం కొనసాగించ బడింది. అయితే 1958—59 లో

యిది అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో ఈ పథకాన్ని శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ తాలూకాకు, పశ్చిమగోదావరి జిల్లా తణుకుతాలూకాకు, కృష్ణా జిల్లా దివి తాలూకాకు, గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాకు, చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాకు విస్తరింప చేయడానికి, ఇంతేకాక ప్రస్తుతము యీ పథకం అమలులో ఉన్న ప్రాంతాలలో దీనిని కొనసాగించడానికి ప్రతిపాదింప బడింది. ఈ పథకం క్రింది కార్యక్రమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయటంద్వారా యిప్పుడున్న 30,000 ఎకరాలేకాక అదనంగా 32,650 ఎకరాలమేర భూమి యీ పథకం క్రిందకు తీసుకురాబడుతుంది. ప్రస్తుతం యీ పథకం పరిశ్రమలశాఖవారి నియంత్రణలో అమలుపరబడుతున్నది. ఇపుడు దీన్ని ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డుక్రిందకు మార్చడానికి ప్రతిపాదింపబడింది. ఈ బోర్డు 1958 నవంబరులో ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో యీ పథకం కోసం రు. 6.00 లక్షలు కేటాయించ బడినాయి.

## కుటీర పరిశ్రమలకు ఋణాలు, సబ్సిడీల నివ్వటానికి సంబంధించిన 1948 సంవత్సరపు నిబంధనల క్రింద ఋణాలు.

వడ్రంగం, నేతపని, కమ్మరం మొదలయిన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలలో పనిచేస్తున్న పని వారికి సహాయం చేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాలకాలంలో రు. 1.64 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. 1958—59 లో యీ పథకం అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో రు. 2.00 లక్షల వరకు ఋణాలు మంజూరు చేయడానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలోని పనివారికికూడ యీ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## పారిశ్రామిక సహకార సంఘాలు.

గ్రామీణ పరిశ్రమలకు సుస్థిరత్వం చేకూర్చడం, వాటి ఉత్పత్తి విధానాల్ని మెరగు పరచడం ద్వారా అధికోత్పత్తిని సాధించేటట్లు చేయడమే యీ పథకం యొక్క ఉద్దేశం. ఇందుకుగాను సహకార సంఘాల ద్వారా దంపుడు

బియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు 10 కేంద్రాలను ప్రారంభించటం, కలంకారి అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూలధనం, యితర ఖర్చుల క్రింద గ్రాంట్లు యివ్వటం, మేలురకం పరికరాలు కొనుక్కోవటానికి గాను గుంటూరు కమ్మరం సహకార సంఘం వారికి ఆర్థిక సహాయం చేయటం, పరికరాలు మొదలయినవి కొనుక్కోవటానికిగాను కుటీర పరిశ్రమల సహకార సంఘములకు సబ్సిడీలు యివ్వటంవంటి పథకాలు రూపొందించ బడినాయి. ఇందుకుగాను యీ పథకంక్రింద ఇంతవరకు రు. 2.72 లక్షల మొత్తం ఖర్చుపెట్ట బడింది. ఈ పథకం కొనసాగింపుకోసం ఈ సంవత్సరానికి రు. 1.58 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడిన ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అధ్వర్యంక్రిందకు యీ పథకాన్ని మార్చటానికి కూడ ప్రతిపాదింపబడింది.

# చేనేతపరిశ్రమ

## సహకారసంఘాలకువాటామూలధనం, నిర్వహణమూలధనంక్రింద ఋణాలు

చేనేత సహకార సంఘాలలో వాటాలు తీసికొని అందులో సభ్యులుగా అయ్యేటందుకు వీలు కల్పించే నిమిత్తం చేనేత పనివారికి ఋణాలను యివ్వటానికి యీ పథకంక్రింద ఉద్దేశించబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో యీ పథకమునకుగాను రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష వాటా మూలధనం క్రిందఋణాలు యివ్వటంకోసం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 500 క్రొత్త మగ్గాలు సహకార సంఘాల క్రిందకు తీసుకు రాబడతాయని, 40 లక్షల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశించబడింది.

## ఆంధ్ర చేనేత సహకార సంఘాలయొక్క మార్కెటింగు వ్యవస్థ విస్తరణ

ఇంకా ఎక్కువగా విక్రయశాలలను ప్రారంభించటంద్వారాను, చేనేత గుడ్డలను గురించి తీవ్ర ప్రచారము చేయటంద్వారాను ఆంధ్ర చేనేత సహకార

సంఘంవారి మార్కెటింగు వ్యవస్థను పటిష్ఠం చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఈ పథకమునకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.31 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు 0.19 లక్ష యీ జిల్లాలో అధనంగా 2 విక్రయశాలలు ప్రారంభించటానికిగాను వినియోగించబడుతుంది ఈ సంవత్సరంలో విక్రయశాలలద్వారా 10 లక్షలగజాలగుడ్డ అమ్మబడుతుందని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, వ్యవస్థ వ్యయాలు

మంచిరకం చేనేత గుడ్డలను ప్రజారంజకంగా ఉండే నమూనాలలో ఉత్పత్తి చేయుటకుగాను చేనేత పరిశ్రమ యొక్క సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి పరచటానికి ప్రతిపాదింపబడింది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో ఈ పథకం అమలుపరచబడింది. స్టాండర్డు రీడ్లు, వార్పింగు యంత్రాలు మొదలయిన మేలురకం పరికరాలు చేనేత పనివారికి సరఫరా చేయబడినాయి. యీ సంవత్సరంలో ఆంధ్రకుగాను ప్రణాళికలో రు. 4.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.41 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. చేనేత పనివారికి 50 స్టాండర్డు రీడ్లను, అయిదు వార్పింగు యంత్రాలను, 50 స్లేలను, ఒక ప్రెస్ మిషనును సరఫరా చేయటానికి, గుడ్డల నాణ్యతను సరిచూడడానికి నియమించబడిన ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్లను కొనసాగించటానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## ముదరా

చేనేత గుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించేటందుకు. తద్వారా చేనేతగుడ్డ ఉత్పత్తిని ఎక్కువచేసేటందుకుగాను ఆంధ్ర చేనేత సహకార సంఘం యొక్క విక్రయశాలల ద్వారాను, ప్రాథమిక చేనేత సహకార సంఘాలద్వారాను జరిగే చేనేత గుడ్డ అమ్మకంపై ముదరా ఇవ్వబడుతున్నది. సామాన్యంగా ఈ ముదరా రూపాయకు 6 నయాపైసలు చొప్పున యివ్వబడుతుంది. సరుకు మిగిలిపోయి ఉన్న సంధర్భాలలో సంఘాలు తమదగ్గర నిలువ ఉండిపోయిన సరకును అమ్మేటందుకుగాను అప్పుడప్పుడు ప్రత్యేక ముదరాకూడ యివ్వ

బడుతుంది. ఈ పథకంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.25 లక్ష మొత్తం ఈ జిల్లాలో ముదరా ఇచ్చుటకుగాను వినియోగించబడుతుంది.

## కంబళ్ళ పరిశ్రమ

ఆంధ్ర ప్రాంతంలో కంబళ్ళ పరిశ్రమాభివృద్ధికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.85 లక్ష యీ జిల్లాకు కింది పనులనిమిత్తం ప్రత్యేకించబడింది.

(1) 300 మగ్గాలతో 4 కంబళ్ళనేత పనివారి సహకార సంఘాలను ఏర్పాటుచేయటం.

(2). గుడ్డల నాణ్యతను సరిచూడటంకోసం ఒక టెక్నికల్ అసిస్టెంటును నియమించటం.

(3) కంబళ్ళనేత పనివారికి క్రింది మేలురకం పరికరాలను సరఫరా చేయటం,

| | | |
|---|---|---|
| (ఎ) ఊలుకార్డింగ్ యంత్రం | .... | 1 |
| (బి) ఫ్లయిషటిల్ మగ్గాలు | .... | 25 |
| (సి) హీల్డులు, రీడ్లు | .... | 12,600 |
| (డి) రీడ్లు | .... | 100 |

(4) విక్రయశాలను ఏర్పాటు చేయటం

ఈ జిల్లాలోని చేనేత సహకార సంఘాలద్వారా 4,000 రగ్గులు, కంబళ్లు తయారు చేయబడతాయని ఆశించబడుతున్నది.

## చేనేతపట్టుపరిశ్రమ అభివృద్ధి.

ఆంధ్ర ప్రాంతంలో చేనేత పట్టు పరిశ్రమకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.08 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.02 లక్ష

అనంతపురం జిల్లాలో అదనంగా 50 మగ్గాలను సహకార సంఘాలక్రిందకు తీసుక రావటానికిగాను ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 0.04లక్ష గజాల పట్టుగుడ్డ తయారు చేయబడుతుందని ఆశించబడుతున్నది.

## రోడ్లు

### ప్రభుత్వ రోడ్లు (బకాయి పనులు)

ఆంధ్ర ప్రాంతంలో బకాయి రోడ్డు పనులను కొనసాగించుటకుగాను 1959—60 సంవత్సరానికి రు. 2.93 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.003 లక్ష ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం కేటాయించ బడింది.

| | | |
|---|---|---|
| 1. | బళ్లారి—కడప రోడ్డులో మై. 23/4 వద్ద వంతెన నిర్మాణం .... | 0.001 |
| 2. | బళ్ళారి-కడపరోడ్డుమీద మై. 24/8 వద్ద వంతెన నిర్మాణం .... | 0.001 |
| 3. | కొండిగొండ—అమరాపురం రోడ్డుమీద మై. 3/6 వద్ద వంతెననిర్మాణం .... | 0.001 |

### ప్రభుత్వ రోడ్లు (క్రొత్త పనులు)

ఆంధ్ర ప్రాంతానికి 1959—60 సంవత్సరానికి యీ పథకంకోసం రు. 41.69 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.286 లక్షల మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | అనంతపురం—తాడిపత్రిరోడ్డుకు 74/0—90/6 మైళ్ళ మధ్య తారు వేయనిచోట్ల తారు వేయుటకు | 0.001 |

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం(రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 2. | నెల్లూరు—బొంబాయి రోడ్డులో రాయలచెరువు-గుత్తి భాగానికి తారు వేయుటకు | 0.002 |
| 3. | మద్రాసు—బొంబాయి రోడ్డులో 271—300/0 మైళ్ళ మధ్య తగిన "రీచి"లలో తారు వేయుటకు | 0.001 |
| 4. | కొడికొండ—అమరాపురం రోడ్డులో 172/4—200/0 మైళ్ళమధ్య "కల్వరు" లను వెడల్పు చేసి, బలపరచుటకు | 0.001 |
| 5. | గుంతకల్లు—మద్దికెరరోడ్డుకోసం భూమిని స్వాధీనం చేసికొని రోడ్డునిర్మించుటకు | 0.001 |
| 6. | మద్రాసు—బొంబాయిరోడ్డు మై. 262/8 వద్ద రేల్వే ఓవర్ బ్రిడ్జినిర్మించుటకు | 0.180 |
| 7. | బళ్ళారి-కడప రోడ్డు మై. 19/2, 24/2, 27/3, 27/5 39/5 వద్ద రోడ్డుకట్టలకు సిమెంటు కాంక్రీటు వేయుటకు | 0.500 |
| 8. | ఉరవకొండ—గుంతకల్లురోడ్డుకు మై. 294/0 నుండి మై. 314/0 వరకు తారువేయుటకు | 0.400 |
| 9. | మద్రాసు—బొంబాయి రోడ్డులో 294/0—308/1 మైళ్ళమధ్య "కల్వర్టు" లను వెడల్పు చేసి, పటిష్టం చేయుటకు | 0.100 |
| 10. | కోడికొండ—అమరాపురం రోడ్డులో "కాజ్ వే" నిర్మించుటకు | 0.100 |

## ప్రభుత్వం స్వాధీనంచేసుకున్న రోడ్లు.

ఇంతకు ముందు ప్రభుత్వంవారు స్వాధీన పరచుకొన్న జిల్లాబోర్డు రోడ్ల స్థాయిని పెంచేటందుకు 1959—60 ప్రణాళికలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 0.68 లక్ష మొత్తం ఈ జిల్లాలోని క్రింది రోడ్ల స్థాయిని పెంచడంకోసం కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959—60 లో కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | కోడూరు—ధర్మవరం రోడ్డు మై. 29/2, 38/1 వద్దవంతెనల నిర్మాణం .... | 0.20 |
| 2. | కోడూరు—ధర్మవరం రోడ్డులో 24/0–39/5 మైళ్ళమధ్య "కల్వర్టు" లను వెడల్పు చేసి, పటిష్ఠం చేయడం .... | 0.20 |
| 3. | రాయదుర్గం—ధర్మవరం రోడ్డులో 90/4–95/5 మైళ్ళమధ్య "క్యారేజ్ వే" ను పటిష్ఠం చేయడం .... | 0.03 |
| 4. | కోడూరు—ధర్మవరం రోడ్డులో 24/0–29/5 మైళ్ళమధ్య "క్యారేజ్ వే" ను బలపరచడం | 0.03 |

ఈ పథకం క్రింద క్రింది జిల్లాబోర్డు రోడ్లనుకూడ స్వాధీనపరచు కొనడానికి ప్రతిపాదించబడింది. కందుకగాను డబ్బు కేటాయించవు అవసరంలేదు.

| వరుస సంఖ్య | రోడ్డు పేరు | పొడవు మైళ్ళలో మై. ఫ. అ. |
|---|---|---|
| 1. | పెనుకొండ—మడిగుబ్బ రోడ్డు ఎం.డి.ఆర్ 0–0–0 నుండి 35–0– వరకు ... | 35—0—0 |

## రోడ్ల ప్రక్కనచెట్లు.

రోడ్ల కిరువైపులా చెట్లను నాటటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో యీ జిల్లాకు రు. 0.04 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

ఈ పథకం క్రింద 1959-60 ప్రణాళికలో రు. 15.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించ బడి ముగింప బడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను పూర్తి చేసే నిమిత్తం ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంట్లు యివ్వటం కోసం పై డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.30 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఇతర రోడ్లు (క్రొత్తపనులు.)

పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను చేకొనే నిమిత్తం యీ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు సగం గ్రాంట్లు యివ్వబడతాయి. జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల ప్రయోజనం పొందేవారు మిగతసగం ఖర్చును భరించాలి. క్రొత్త పనుల నిర్వహణ నిమిత్తం ఆంధ్రలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు యివ్వటం కోసం 1959-60 లో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.30 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు.

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలు, గ్రామాలకు క్రొత్త రోడ్లు, గ్రామాలకు గ్రామాలకు మధ్య రోడ్లు నిర్మించటం జరుగుతుంది. జిల్లా కలెక్టర్లు యీ పథకం క్రింద చేయవలసిన పనులను నిర్ణయించి నిర్వహిస్తారు. ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తారు. మిగత సగం ఖర్చుయీ రోడ్లవల్ల ప్రయోజనం పొందే ప్రజలు భరించాలి. ఆంధ్రలో యీ పథకం క్రింద 1959—60 లో రు. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 1.413 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## పర్యటనాత్వాభివృద్ధి

ఆంధ్రలో పర్యటనత్వాభివృద్ధికి గాను 1959-60 ప్రణాళికలో రు. 1.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. వసతిసౌకర్యాలు, వినోదసౌకర్యాలు ముఖ్యంగా యీ పథకం క్రింద సమకూర్చ బడతాయి. పై మొత్తంలో రు. 0.08 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. పెనుకొండలోని పి.డబ్ల్యు.డి. ఇనస్పెక్షన్ బంగళాకు అభివృద్ధిపనులు చేయటంకోసం పైడబ్బు వినియోగించ బడుతుంది.

# విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్యాభివృద్ధికోసం రు. 7.532 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుససంఖ్య | పథకం పేరు | | కేటాయింపు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | | |
| 1. | 1958-59లో ప్రభుత్వబేసిక్ శిక్షణపాఠశాలలకు అనుబంధించబడిన ప్రీ-బేసిక్ విభాగలకు (ఒక విభాగం) | — | 0.020 |
| 2. | 1956-57లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు | | |
| | (ఎ) ప్రభుత్వంవారివి (సాంఘిక సంక్షేమ శాఖ) (6 పాఠశాలలు) | | 0.060 |
| | (బి) స్థానిక సంస్థ లవి (9 పాఠశాలలు) | ... | 0.020 |

3. 1957—58 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, అదనంగా నియమించబడిన ఉపాధ్యాయులు.

| | | |
|---|---|---|
| (ఎ) స్థానికసంస్థలవి | (20 పాఠశాలలు) | 0.[illegible]0 |

4. 1958—59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు

| | | |
|---|---|---|
| (ఎ) స్థానికసంస్థలవి | (4 పాఠశాలలు) | 0.020 |
| (సి) ఎయిడెడ్ వి (1 పాఠశాల) | .... | 0.010 |

5. 1957—58 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు.

| | | |
|---|---|---|
| (ఎ) స్థానిక సంస్థలవి (14 పాఠశాలలు) | .... | 0.210 |

6. 1958—59 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు

| | | |
|---|---|---|
| (ఎ) స్థానిక సంస్థలవి | (4 పాఠశాలలు) | 0.020 |
| (బి) ఎయిడెడ్ వి | (4 పాఠశాలలు) | 0.020 |

7. 1957—58లో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు

| | |
|---|---|
| (ఎ) స్థానికసంస్థలవి (సాంఘిక సంక్షేమ శాఖ) (4 పాఠశాలలు) | 0.004 |
| (బి) ప్రభుత్వంవారివి (38 పాఠశాలలు) | |
| (సి) ఎయిడెడ్ వి (13 పాఠశాలలు) | |

8. 1958—59 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు.

(ఏ) స్థానిక సంస్థలవి (14 పాఠశాలలు)
(బి) ఎయిడెడ్ వి (5 పాఠశాలలు) } 0.008

9. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలోని ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపు. ... 2.500

10. 1958—59 లో జిల్లా బోర్డులు స్వాధీనం చేసుకొన్న ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలు 1.000

11. 1956—57 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు.

(ఎ) లోకలు బోర్డువి (22 పాఠశాలలు) .... 0.140

(బి) ఎయిడెడ్ వి (ఒక పాఠశాల) .... 0.010

12. 1957—58 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు.

(ఎ) ప్రభుత్వంవారివి (1 పాఠశాల) 0.080

(బి) స్థానిక సంస్థలవి (4 పాఠశాలలు, 4 సెక్షనులు) .... 0.100

(సి) ఎయిడెడ్ వి (2 సెక్షనులు) .... 0.060

13. 1958—59లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు (ప్రభుత్వంవారివి.) (ఒక పాఠశాల, ఒక సెక్షను) 0.100

14. 1957–58, 1958–59 సంవత్సరాలలో ప్రారంభించబడిన ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలకు భవనాలు, ఆటస్థలాలు (2 పాఠశాలలు) .... 0.120

15. 1956—57 లో సెకండరీ గ్రేడు ట్రైనింగు సెక్షన్లుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ గ్రేడు ట్రైనింగు సెక్షనలు .... 0.010

16. 1958—59 లో బేసిక్ పద్ధతికి మార్చబడిన శిక్షణ పాఠశాలలకు .... 0.020

17. 1957-58 లో ఇనస్పెక్టరేటులలో నియమించ బడిన గుమాస్తాలు, టైపిస్టులు (4గురికి) ... 0.030

18. 1958—59 లో నియమించబడిన సీనియరు డిప్యూటీ ఇన్స్పెక్టర్లు, జవానులతోసహా (4 గురు) ... 0.060

19. 1958–59లో ఇనస్పెక్టరేటులోని నియమించ బడిన ఒకఅప్పరు డివిజను గుమాస్తాకు (ఒక గుమాస్తా) .... 0.010

20. IIIఫారం వరకు ఉచిత విద్యా పథకాన్ని అమలు పరచటానికి ఇన్స్పెక్టరేట్లలో నియమించబడిన అప్పరు డివిజను గుమాస్తాలు (ఒక గుమాస్తా) .... 0.030

## క్రొత్త పథకాలు

21. విద్యావంతులలో నిరుద్యోగాన్ని నివారించ డానికి పథకం .... 1.090

| | | |
|---|---|---|
| 22. | ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయుల నియామకం (27గురు ఉపాధ్యాయులు) | 0.130 |
| 23. | ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చడం | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (21 పాఠశాలలు) .... | 0.060 |
| | (బి) ఎయిడెడ్‌వి (7 పాఠశాలలు) ... | 0.020 |
| 24. | స్త్రీ విద్యకు సంబంధించిన కేంద్ర పథకం కొరకు ఒక హైయర్ ఎలిమెంటరీ గ్రేడు శిక్షణ పాఠశాల .... | 0.170 |
| 25. | 1958—59 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంటులు (ఎయిడెడ్) (1 పాఠశాల) | 0.060 |
| 26. | 1958—59 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు | |
| | (ఎ) ఎయిడెడ్‌వి (4 పాఠశాలలు) .... | 0.010 |
| | (బి) స్థానికసంస్థలవి (14 పాఠశాలలు) .... | 0.370 |
| 27. | మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనుల ప్రారంభించటం (ఎయిడెడ్) 5 పాఠశాలలు—కాంపెన్‌సేటరీ గ్రాంటు .... | 0.050 |
| 28. | బేసిక్ పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభిచటం (ఒకటి) .... | 0.070 |
| 29. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను).... | 0.020 |

| | | |
|---|---|---|
| 30. | ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (3 పాఠశాలలు.) .... | 0·010 |
| 31. | జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (3 జీపులు) .... | 0.160 |
| 32. | అదనపు జిల్లా విద్యాశాఖాధికారిని నియమిం (ఒకరు) .... | 0.290 |
| | మొత్తం | 7.532 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 2.434 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు. | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఎ) ప్రభుత్వంవారివి (ఒక సెక్షను) .... | 0.010 |
| | (బి) స్థానిక సంస్థలవి ( 1 సెక్షనులు) ... | 0.010 |
| | (సి) ఎయిడెడ్‌వి (4 సెక్షనులు) .... | 0.020 |
| 2. | 1957—58లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు. అదనపు సెక్షనులు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి ( 1 సెక్షను) .... | 0.010 |

(బి) ఎయిడెడ్‌వి (2 సెక్షనులు) .... 0.020

3. 1957—58లో హైయర్ సెకండరీ పాఠశాలల స్థాయికి మార్చబడిన ఉన్నత పాఠశాలలు.

(ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల) 0.020

(బి) ఎయిడెడ్‌వి (ఒక పాఠశాల) .... 0.020

4. ఉన్నత పాఠశాలలకు భవనాలకోసం గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలకు .... 0.050

(బి) ఎయిడెడ్‌వాటికి .... 0.020

5. హైయర్ సెకండరీ పాఠశాలలకు భవనాలు

(ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల) .... 0.050

(బి) ఎయిడెడ్‌వి (ఒక పాఠశాల) .... 0.030

6. సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలు పెంచటానికి .... 0.570

## క్రొత్త పథకాలు

7. 1958—59లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి .... 0.100

(బి) ఎయిడెడ్‌వి .... 0.050

8. మాధ్యమిక పాఠశాలలను (ప్రభుత్వంవారివి) ఉన్నత పాఠశాలల స్థాయికి పెంచటం; సెకండరీ పాఠశాలలలో అదనపు సెక్షనులను

ప్రారంభించటం (కదిరిలోను హిందూపురం లోనువున్న ప్రభుత్వ మాధ్యమిక బాలికల పాఠశాలలు) .... 0.070

9. ఉన్నత పాఠశాలలను హైయర్ సెకండరీ పాఠశాలలుగా మార్చటం

(ఎ) ప్రభుత్వంవారివి (ఒక పాఠశాల) .... 0.500

(బి) ఎయిడెడ్‌వి (ఒక పాఠశాల) .... 0.600

10. ఉన్నత పాఠశాలలకు భవనాల క్రింద గ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలవి. ... 0.050

(బి) ఎయిడెడ్‌వి .... 0.100

11. ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్య పరికరాలకు గానుగ్రాంట్లు

(ఎ) స్థానిక సంస్థలకు .... 0.100

(బి) ఎయిడెడ్ వాటికి .... 0.050

12. XI, XII తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు. .... 0.004

13. టి.టి.సి. కోర్సుల నిర్వహణకు 0.020

14. ప్రభుత్వ బాలుర బహూళార్థసాధక హైయర్ సెకండరీ పాఠశాలలో ఫిజికల్ డైరక్టర్ల (వ్యాయామ శిక్షకులు) నియామకం (నాలుగు పదవులు) 0.010

మొత్తం 2.484

# యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యాభివృద్ధికిగాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 34.64 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.76 లక్ష క్రింది పథకాలకుగాను యీ జిల్లాకు కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ప్రభుత్వ కళాశాలల్లో ప్రి-యూనివర్సిటీ కోర్సులు (1956—57 లో ప్రారంభించ బడినట్టివి.) .... | 0.10 |
| | **క్రొత్త పథకాలు** | |
| 2. | ప్రభుత్వ కళాశాలల్లో మూడేళ్ల డిగ్రీ కోర్సును ప్రవేశ పెట్టటం. .... | 0.66 |
| | మొత్తం | 0.76 |

## ఇతర పథకాలు

క్రింద చూపిన విధంగా ఇతర పథకాలకోసం యీ జిల్లాలో రు. 0.535 లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | ఎన్. సి. సి., ఎ. సి. సి. ల విస్తృతికి ... | 0.410 |
| 2. | స్కౌటింగు, గర్ల్‌గైడింగు అభివృద్ధికి .... | 0.020 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | పంచాయితీలకు, ప్రయివేటువారికి, సహకార సంఘాలకు, గ్రామ సంఘాలకు, స్థానిక సంస్థలకు చెందిన గ్రంథాలయాలకు గ్రాంట్లు.... | 0.050 |
| 4. | ఎన్.సి.సి., యూనిట్లకు "ఏరో మాడలింగ్" మరియు "షిప్ మాడలింగ్" పరికరాలను సరఫరా చేయటం .... | 0.010 |
| 5. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు (ఒక పాఠశాల) | 0.020 |
| 6. | హిందీ ప్రేమీ మండలుల గ్రంథాలయాలకు గ్రాంట్లు ... | 0.010 |
| 7. | యువజన సంక్షేమ కార్యకలాపాలు .... | 0.010 |
| 8. | ఎన్. సి. సి., ఏ.సి.సి. యూనిట్లలో పనిచేసే చౌకీదార్ల జీతాల సవరింపుకు. .... | 0.010 |
| | మొత్తం | 0.535 |

## అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో డిప్లొమాకోర్సు

అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలలో కూడ "కంప్రెస్‌డ్ డిప్లొమా కోర్సు" లు ప్రారంభించబడినాయి. 1957-58లో యివి రద్దు చేయబడి యీకళాశాలకు ఒక "పాలిటెక్నిక్" అనుబంధించబడింది. ఇంజనీరింగ్ శాస్త్రం లోని మూడు శాఖలలోను "సేవనలు సర్టిఫికేటు" స్థాయిలో "డిప్లొమాకోర్సు"లు యిందులో ప్రవేశ పెట్టబడినాయి.

తరగతిగదుల కోసం శాశ్వతభవనాలను నిర్మించటానికి, డ్రాయింగు హాళ్ళను, అడ్మినిస్ట్రేటివ్ బ్లాకులను నిర్మించటానికి, సిబ్బందికి, పరికరాల క్రింద అయ్యేఖర్చు క్రింద రెండవ పంచవర్ష ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. భవనాల నిర్మాణాన్ని ప్రారంభించటానికి, పరికరాలను కొనటానికి, సిబ్బందికి జీతాలుచెల్లించటానికి, ఇతరచిల్లర ఖర్చులక్రింద ఈ సంవత్సరానికి రు. 3.14 లక్షల మొత్తం కేటాయించబడింది.

## కాకినాడ, అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలల్లో ప్రీ-ప్రొఫెషనల్ కోర్సును ప్రవేశపెట్టటం

1958-59లో కాకినాడ, అనంతపురం ఇంజనీరింగ్ కళాశాలల్లో ప్రీ-ప్రొఫెషనల్ కోర్సులు ప్రవేశపెట్టబడినాయి. ప్రతికళాశాలలోను 120 మంది విద్యార్థులను చేర్చుకోవడానికి వీలుకల్పించబడింది. అదనపువసతిని సమకూర్చటంకోసం రెండుకళాశాలల్లోను భవనాల నిర్మాణం ప్రారంభించ బడింది వర్తమాన సంవత్సరపు ప్రణాళికలో పరికరాలకు (రు. 0.50 లక్ష), భవనాల నిర్మాణానికి (రు. 0.11 లక్ష), సిబ్బందిజీతాలకు, చిల్లరఖర్చులకు (రు. 0.88 లక్ష), గాను రు. 1.49 లక్షల మొత్తం కేటాయించబడింది.

# వైద్యం

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు యితర వైద్య సంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చటం కోసం రెండవ ప్రణాళికా కాలంలో అద

నంగా 495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులలోను, యితర టీచింగు ఆసుపత్రులలోను ఉన్న 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి యీ శిక్షణ యివ్వబడుతుంది. అదేప్రకారం 1956—57, 1958—59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ సంవత్సరంలో రు. 0.22 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.22 లక్ష అనంతపురంలో ఉన్న జిల్లా కేంద్ర ఆసుపత్రిలో 9 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## మంత్రసానులకుశిక్షణ

అదనంగా మంత్రసానులకు శిక్షణ యివ్వటంకోసం ఈసంవత్సరపు ప్రణాళికలో రు. 1.26 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో 18 మంది మంత్రసానులకు రు. 0.25 లక్షవ్యయంతో అనంతపురంలోని జిల్లా హెడ్ క్వార్టర్సుఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## జిల్లా కేంద్రాలలోని ఆసుపత్రుల అభివృద్ధి

రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 13.00 లక్షల మొత్తం ఖర్చుతో అదనంగా భవనాలు నిర్మించటంద్వారాను, పరికరాలను సిబ్బందిని మొదలయిన వాటిని సమకూర్చటంద్వారాను ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా ఆసుపత్రులకు అనేకమైన అభివృద్ధిపనులు చేయబడినాయి. జిల్లా ఆసుపత్రులను అభివృద్ధి పరచటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 9.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.00 లక్షల మొత్తం అనంతపురంలోని జిల్లా ఆసుపత్రికి అభివృద్ధిపనుల నిమిత్తం వినియోగించ బడుతుంది.

## తాలూకా కేంద్రాలలోని ఆసుపత్రులకు అభివృద్ధి పనులు.

పడకల సంఖ్యను పెంచడం, అదనంగా భవనాలను నిర్మించడంద్వారా ఆంధ్రప్రాంతంలోని తాలూకా ఆసుపత్రులనుఅభివృద్ధి చేయటంకోసం రెండవ

ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలో రు. 4.74 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.13 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటం మూలంగా తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, కదిరి, హిందూపురం, పెనుకొండ తాలూకా ఆసుపత్రులను ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.21 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1956—58 లలో స్వాధీనం చేసికో బడినట్టి ధర్మవరం, కళ్యాణదుర్గం ఆసుపత్రుల నిర్వహణకు పై డబ్బు వినియోగించబడుతుంది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1958—59 లో అనంతపురంలోని హెడ్ క్వార్టర్స్ ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## జిల్లాలేబరేటరీలు, ప్రాంతీయలేబరేటరీలు

1957-59 సంవత్సరాలలో స్థాపించబడిన 2 ప్రాంతీయ లేబరేటరీలను, 2 జిల్లా లేబరేటరీలను నిర్వహించమేగాక ఒక జిల్లా లేబరేటరీని క్రొత్తగా స్థాపించు

టకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.72 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.10 లక్ష 1959—60లో అనంతపురంలో ఒక జిల్లా లేబరేటరిని ఏర్పాటు చేయటంకోసం ప్రత్యేకించ బడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదలను అరికట్టడం అవసరమయింది. ఇందువల్ల 1957—59 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను— 10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.66లక్ష కేటాయించబడింది, ఇందులో రు.0.02 లక్ష ఈ జిల్లాలో వినియోగించబడుతుంది. జమ్మలమడుగులో ఒక కుటుంబ నియంత్రణ కేంద్రం ఏర్పాటుచేయటానికి, 1957—58 లో అనంతపురంలో ప్రారంభించబడిన కేంద్రాన్ని నిర్వహించిడానికి పై డబ్బు వినియోగించ బడుతుంది.

## సహాయక నర్సు—మంత్రసానులకు శిక్షణ

సహాయకనర్సు - మంత్రసానుల శిక్షణకోసం యింతకు ముందు ప్రారంభించిన 5 కేంద్రాలను నిర్వహించటానికి, క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ఈ సంవత్సరంలో ప్రారంభించటానికిగాను ప్రణాళికలో రు. 0.78 లక్ష కేటాయించబడింది, ఇందులో రు. 0.10 లక్ష అనంతపురంలోని జిల్లా కేంద్ర ఆసుపత్రిలో ఏర్పాటుచేయబడిన శిక్షణ కేంద్రాన్ని కొనసాగించటం కోసం ప్రత్యేకించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకంక్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి.

ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకం క్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.50 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 4 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికి పై డబ్బు వినియోగించబడుతుంది.

## దంత వైద్య కళాశాల, దంత చికిత్సా కేంద్రాల ఏర్పాటు

ఈ పథకం క్రింద యీ సంవత్సరంలో రు. 3.06 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.50 లక్షల మొత్తం ఆంధ్ర ప్రణాళిక క్రింద, రు. 0.56 లక్ష తెలంగాణా ప్రణాళిక క్రింద కేటాయించ బడినాయి. ఇంతకు ముందు ప్రారంభించిన దంత చికిత్సా కేంద్రాలను నిర్వహించటమే కాకుండా క్రొత్త వాటిని ప్రారంభించటానికి, హైదరాబాదులోని ఉస్మానియా వైద్యకళాశాలలో 1958—59 సంవత్సరంలో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని కొనసాగించటానికిగాను యీ డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.20 లక్ష అనంతపురంలో జిల్లా ఆసుపత్రిలో 1958—59 లో ఏర్పాటు చేయబడిన దంత చికిత్సా విభాగాన్ని నిర్వహించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుష్టురోగ నివారణ

1957—58, 1958—59 సంవత్సరాలలో ప్రారంభించబడిన 4 కుష్టు వ్యాధి నివారణ సహాయక కేంద్రాలను కొనసాగించటానికి, క్రొత్తగా మరో 2 కేంద్రాలను ప్రారంభించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.55 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.50 లక్ష యీ జిల్లాలోని అనంతపురంలో ఒక కుష్టు వ్యాధి నివారణ కేంద్రాన్ని ఏర్పాటు చేయుటకుగాను ప్రత్యేకించబడింది.

## క్షయ రోగులకు ప్రత్యేక పడకలు

క్షయ రోగులకుగాను ఈ సంవత్సరంలో 290 ప్రత్యేక పడకలను ఆంధ్రలో ఏర్పాటు చేయడానికి, యింతకు ముందు ఏర్పాటు చేసినవాటిని

నిర్వహించటానికిగాను రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష అనంతపురంలోని జిల్లా ఆసుపత్రిలో క్షయ రోగులకుగాను 20 ప్రత్యేక పడకలను ఏర్పాటుచేసే నిమిత్తం ప్రత్యేకించబడింది.

# ప్రజారోగ్యం

## దాయీలకు శిక్షణ

గ్రామీణ ప్రాంతాలలో ఇండ్లలోనే కాన్పులు జరిగే పద్ధతిని మెరుగు పరచడానికిగాను 1956–57 సంవత్సరంలో యీ శిక్షణ పథకం ప్రారంభించ బడింది. నాటు మంత్రసానులు పురుళ్లు పోయడంలో ఉత్తమ పద్ధతుల నవలంబించి తమవృత్తిని నిర్వహించడానికిగాను యీపథకం క్రింద శిక్షణ యివ్వ బడుతుంది. రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలలో 1,329 మంది ఈ పథకంక్రింద శిక్షణకోసం చేర్చుకోబడ్డారు. ఈ సంవత్సరంలో ఆ పథకం కొనసాగింప బడడమే కాకుండా మరొక 720 మంది అభ్యర్థులు చేర్చుకోబడతారు. అందుకోసం రు. 0.81 లక్ష మొత్తం రాజ్య ప్రణాళికలో కేటాయించబడింది. 60 మంది దాయీలకు శిక్షణ నిచ్చేటందుకు ఆ మొత్తంలో 10,300 రూపాయలు ఈ జిల్లాలో వినియోగించ బడతాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన 2మలేరియా నివారణ యూనిట్లు 1953—57లో కొనసాగింప బడినాయి. 1957—58 లో మరో 2 యూనిట్లు ఏర్పాటుచేయడం జరిగింది. ఈ 4 యూనిట్లు 1958—59 లో కొనసాగించ బడ్డాయి. ఈ వ్యాధిరాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చ టానికి ఈ యూనిట్లు ఉపకరించాయి. నేషనల్ మలేరియా నివారణ కార్య క్రమం మలేరియా నిర్మూలనా కార్యక్రమంగా 1—4—1958 నుండి మార్చ బడింది. అవసరంగా స్ప్రేయింగు పరికరాలు, డి.డి.టి. ని సరఫరా చేయడం ద్వారా మలేరియా సోకని ప్రాంతాలతోసహా రాజ్యం అంతటా మందు చల్లడం తీవ్రం చేయబడుతుంది. 17 సబ్ యూనిట్లతో ప్రస్తుతం ఉన్న 4 యూనిట్లను కొనసాగించడానికి, 16 హైపో-ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, ప్రజారోగ్య

శాఖా ప్రాంతీయఅసిస్టెంటు డైరక్టర్ల కార్యాలయాలను మూడింటిని నెలకొల్పడానికి 1959—60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వం వాటాక్రింద రూ. 22.29 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 1.36 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ప్రస్తుతం ఉన్న ఒక సబ్ యూనిట్టును కొనసాగించడానికి, ఒక హైపో ఎండమిక్ యూనిట్టును ప్రారంభించడానికి ప్రజారోగ్యశాఖ ప్రాంతీయ డైరెక్టరు కార్యాలయాన్నొకదాన్ని ఏర్పాటు చేయడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్యవిషయాలను తెలియ చెప్పేటందుకు 1957—58 లో ప్రజారోగ్యశాఖ డైరక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ స్థాపించబడింది. రెండు వ్యాన్లు కొనబడ్డాయి. ఇంతకుముందుకొన్న 11 జీపులను, అంటువ్యాధుల నివారణగురించి ప్రచారంచేయడానికి ఉపకరించే రెండు వ్యానులను నిర్వహించడం జరిగింది. 1958—59 లో ఈ పథకాన్ని కొనసాగించడానికి న్యూఢిల్లీలోని వర్కింగు గ్రూపు సమ్మతించలేదు. అయినప్పటికి లో జిల్లాలలో ప్రస్తుతంఉన్న 11 జీపులను, 4 వ్యానులను నిర్వహించడానికి, హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచారసంస్థను కొనసాగించడానికి, 8 క్రొత్త వ్యానులను కొనడానికిగాను 1959—60 లో రూ. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 0.12 లక్ష యీజిల్లాలోఉన్న ఒక జీపు, ఒకవ్యాను నిర్వహణకోసం ప్రత్యేకించబడింది.

## విద్యార్థి ఆరోగ్య కేంద్రాలు

పాఠశాలల్లో చదువుకొనే పిల్లల సౌకర్యార్థం ప్రస్తుతమున్న 2 విద్యార్థి ఆరోగ్య కేంద్రాలను కొనసాగించటానికి, యింకా 2 కేంద్రాలను స్థాపించటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 2.37 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.605 లక్ష యీ జిల్లాలో ఒక విద్యార్థి ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేసే నిమిత్తం వినియోగించబడుతుంది.

# గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

## పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానికసంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగుపారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102.446 లక్షల మొత్తాన్ని (రు. 82.446 లక్షల మొత్తం కేంద్రప్రణాళికక్రింద, రు. 20.00 లక్షలమొత్తం రాష్ట్రప్రణాళికక్రింద) ఋణ సహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది. ఇందులో రు. 41.270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 1 60 లక్షల మొత్తం క్రిందిపథకాలకుగాను యీ జిల్లాలో వినియోగించబడుతుంది.

| పథకం పేరు | | కేటాయించబడిన మొత్తం (రూ, లక్షలలో) |
|---|---|---|
| 1. అనంతపురం నీటి సరఫరా అభివృద్ధి పనులు | .... | 0.600 |
| 2. పెనుకొండ నీటి సరఫరా పథకం | .... | 1.000 |
| | మొత్తం | 1.620 |

## గ్రామ ప్రాంతాలకు నీటి సరఫరా, పారిశుధ్య సౌకర్యాలకోసం జాతీయ పథకం

గ్రామీణ ప్రజలకు మంచినీటి, పారిశుధ్య సౌకర్యాలను కలుగచేయడమే ఈ పథకం ఉద్దేశం. ఆంధ్ర ప్రాంతానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 16.34 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ కార్యక్రమాన్ని తీవ్రతరం

---

*ఇందులో రు. 5 446 లక్షల మొత్తం యీ పథకానికిగాను గత సంవత్సరం కేటాయించబడిన మొత్తంలో ఖర్చు పెట్టబడకుండా మిగిలి పోయి వచ్చింది.

చేయడంకోసం మొదటి ప్రణాళికా కాలంలో ఏర్పాటుచేయబడిన క్రింది 4 యూనిట్లను కొనసాగించటానికిగాను పై మొత్తంలో 5.49 లక్షల మొత్తం ప్రత్యేకించబడింది. పై నాలుగు యూనిట్లలోను 459 గ్రామాలున్నాయి.

1. విశాఖ పట్టణం జిల్లాలో ఉన్న విశాఖ పట్టణం యూనిట్టు
2. గుంటూరు జిల్లాలోని మాచెర్ల యూనిట్టు
3. అనంతపురం జిల్లాలోని కదిరి యూనిట్టు
4. కర్నూలు జిల్లాలోని పత్తికొండ యూనిట్టు

# గృహ నిర్మాణం

## మురికి పేటల నిర్మూలన, పాకీవారికి గృహవసతి

అనారోగ్యకరమైన మురికి పేటలు ఏర్పడకుండా అరికట్టేటందుకుగాను మురికి పేటలలో నివసించే వారి కోసం మురికిపేటల నిర్మూలన పథకాన్ని భారత ప్రభుత్వం వారు రూపొందించారు. ఈ పథకాన్ని అమలుపరడానికి ఈ జిల్లాలో మురికిపేటల నిర్మూలనకుగాను కొంత మొత్తం కేటాయించ బడింది.

ప్రతిపథకానికి అంచనా వేయబడే ఖర్చులో నూటికి 75 వంతులు భారత ప్రభుత్వం వారు ఇస్తారు. అందులో నూటికి 50 వంతులు ఋణం క్రింద, 25 వంతులు సబ్సిడీ క్రింద ఇస్తారు. రాష్ట్ర ప్రభుత్వం మాదింగు గ్రాంటు క్రింద నూటికి 25 వంతులు భరిస్తుంది.

## పారిశ్రామిక గృహ నిర్మాణ పథకం

భారత ప్రభుత్వంవారు ఋణాల రూపంలోను, సబ్సిడీల రూపంలోను యిచ్చే ఆర్థిక సహాయంతో యీ పథకంక్రింద పారిశ్రామిక కార్మికులకు యిళ్ళు నిర్మించటానికి తలపెట్టబడింది. ఈ పథకంక్రింద రెండురకాల యిళ్ళు నిర్మించ బడతాయి. ఒక గది ఇల్లు ఒక్కొక్కటి రు. 3300/ లు ఖర్చుతోను, రెండు గదుల ఇళ్ళు ఒక్కొక్కటి రు. 3850/ ల ఖర్చుతోను నిర్మించబడతాయి. పై

మొత్తంలో భూమి ఖరీదు, అభివృద్ధి పనులకయ్యే ఖర్చుకూడ చేరుతుంది. అయితే నీటిసరఫరా, పారిశుధ్యం, విద్యుచ్ఛక్తి మొదలగు సౌకర్యాలకయ్యే ఖర్చు యిందులో చేరదు. ఈ పథకం క్రింద ఇండ్ల నిర్మాణాన్ని కొనసాగించే నిమిత్తం 1959—60 ప్రణాళికలో రు. 21.88 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ డబ్బుతో నంద్యాలలో 50 ఇళ్ళు, బుగ్గనపల్లిలో 110 ఇళ్ళు, విశాఖ పట్టణంలో 150 ఇళ్ళు, గుంటూరులో 150 ఇళ్ళు, గుంతకల్లులో 100 ఇళ్ళు, రాజమండ్రిలో 100 ఇళ్ళు, ఏలూరులో 100 ఇళ్ళు నిర్మించడం ప్రారంభించ బడుతుంది.

### పట్టణాలలో గృహ వసతి సహకార సంఘాలు

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లను నిర్మించు కోవడానికి దీర్ఘకాలిక ఋణాల నివ్వడంద్వారా పట్టణ ప్రాంతాలలోని ఇండ్ల కొరతను తీర్చడానికి ఉద్దేశించ బడింది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 340 ఇండ్లను నిర్మించు కోవడానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రు. 20.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.50 లక్ష మొత్తం యీ జిల్లాలో 8 ఇళ్ళ నిర్మాణానికిగాను ప్రత్యేకించ బడింది.

## కార్మికులు - కార్మిక సంక్షేమం

### ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే:

1. ఏ రకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్నవిషయాన్ని ఎంప్లాయి మెంటు అధికారులు ఖచ్చితంగా నిర్ణయించడం కోసం ఇంకా ఎక్కువ వివ రాలను వారికిఅంద చేయడం.

2. విద్యాభ్యాసం పూర్తిచేసిన వారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్నవారికి ఉద్యోగాల విషయంలోను, ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహానిచ్చే టందుకు సమాచారాన్ని లభ్యం చేయడం.

3. ఉద్యోగ సాధక కేంద్ర యొక్క పరిధిలో ఉండే ప్రాంతంలో గాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింప బడే ఇతర ప్రాంతాలలో గాని ఉద్యోగ నియమావకాశాలలో వచ్చే మార్పులు గమనించడానికి తగిన విధానాన్ని రూపొందించడం.

4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగ, నిరుద్యోగాల పోకడలను ముందుగా సూచించడం.

ఈ పథకం, 1957-58లో 5 ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాల్లో అమలు పరచబడింది. ఆ కేంద్రాలేవంటే హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్టణం, విజయవాడ, కర్నూలు. వీటి కేంద్ర యూనిట్టు హైదరాబాదులో ఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. 1958-59లో ఈ పథకం, కాకినాడ, గుంటూరు, నిజమాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింప చేయబడింది. 1959-60లో విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులలోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం, పైన తెలుప బడిన ఎక్స్ఛేంజిలలో అదనపు సిబ్బందిని నియమించడం, డైరెక్టరేటులోని సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి అజ్మాయిషి క్రింద ఉంచడంద్వారా సెంట్రల్ యూనిట్టును పటిష్ఠం చేయటం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలోకూడ సిబ్బందిని పెంచడానికి ఉద్దేశించ బడింది. ఈ కేంద్రాలన్నిటిలోను ఒక్కొక్క గుమస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యేఖర్చులో కేంద్ర ప్రభుత్వం వారు భరించే రు. 0.47 లక్షలతోడుగా రాజ్య ప్రభుత్వ వాటా క్రింద 959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం రు. 0.78 లక్షలోను రు. 0.012 లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమం క్రింద వినియోగించ బడుతుంది.

## వృత్తిపనివారికి శిక్షణ సౌకర్యాల విస్తరణ
## పారిశ్రామిక శిక్షణ కేంద్రం, అనంతపురం

అదనపు పరికరాలను సమకూర్చటం ద్వారాను, సిబ్బందిని నియమించటం ద్వారాను 1958—59 లో యీ సంస్థలో యింకా 168 మందిని

అదనంగా చేర్చుకోవటానికి వీలు కల్పించబడింది. అదనపు భవనాలను నిర్మించడంద్వారాను, పరికరాలను సమకూర్చటం ద్వారాను, అదనపు సిబ్బందిని నియమించటం ద్వారాను యింకా వంద మందిని ఈ సంవత్సరంలో చేర్చుకోవటానికి ప్రతిపాదింప బడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో రాష్ట్రప్రభుత్వ వాటా క్రింద 1.93 లక్షల మొత్తం, కేంద్రప్రభుత్వ వాటా క్రింద రు. 2.91 లక్షల మొత్తం కేటాయించబడినాయి. పై డబ్బు క్రింది విధంగా యీ సంస్థ కోసం వినియోగించబడుతుంది.

| | | | మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|---|
| 1. | వర్కు-షాపు షెడ్లను అదనంగా నిర్మించటం | ... | 2.00 |
| 2. | పరికరాల కొనుగోలు | .... | 1.79 |
| 3. | సిబ్బందికి జీతాలు, చిల్లర ఖర్చులు | — | 1.05 |
| | | మొత్తం | 4.84 |

ప్రస్తుతమున్న పారిశ్రామిక శిక్షణ సంస్థలకు పరికరాల సరఫరా

వర్కు-షాపు సౌకర్యాలను అభివృద్ధి చేసే ఉద్దేశంతో కాకినాడ, అనంతపురం, వుయ్యూరులలో ఉన్న పారిశ్రామిక శిక్షణ సంస్థలకు లోటుగా ఉన్న పరికరాలను సరఫరా చేయటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకమునకుగాను రాష్ట్రప్రభుత్వ వాటా క్రింద రు. 0.75 లక్ష, కేంద్రప్రభుత్వ వాటా క్రింద రు. 1.12 లక్షల మొత్తం కేటాయించబడినాయి. మొత్తం కేటాయించబడిన డబ్బులో రు. 0.623 లక్ష యీ జిల్లాలోని పారిశ్రామిక శిక్షణ సంస్థకుగాను వినియోగించ బడుతుంది.

## వెనుకబడినతరగతులు, షెడ్యూల్డుకులాలసంక్షేమం.

### షెడ్యూల్డు కులాలు-షెడ్యూల్డు కులాల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

ఈ పథకంక్రింద హరిజన విద్యార్థులకు ఇతర అర్హమైన కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరు షిప్పులు మంజూరు చేయబడుతున్నాయి.

తల్లి దండ్రుల ఆదాయం ఉన్నత పాఠశాల విద్యార్థుల విషయంలో రు. 1,500లకు, కళాశాల విద్యార్థుల విషయంలో రు. 1,800లకు మించకుండా ఉంటే రుసుం చెల్లించనవసరంలేకుండా మాఫీ చేయబడుతుంది. 1959—60 లో ఇదివరకు మంజూరుచేసిన స్కాలరుషిప్పులను కొనసాగించడమే కాకుండా సుమారు 1,600 అదనపు స్కాలరు షిప్పులను మంజూరు చేయడానికిగాను రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. స్కాలరు షిప్పులు ఈ జిల్లాలోని అర్హ విద్యార్థులకుకూడా ఇవ్వబడతాయి.

### షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళు

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడుపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యా సంవత్సరానికి విద్యార్థికి రు. 150 చొప్పున బోర్డింగు గ్రాంట్లు వెనుకబడిన తరగతుల, హరిజనుల విద్యార్థులకు ఏటా ఇవ్వబడుతు న్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయ్యడానికి రు. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడ ఇవ్వబడతాయి.

### షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు.

ఈ జిల్లాలోని అనంతపురం మడకసిరలలోఉన్న హాస్టళ్ళు 1959—60లో రు. 0.199 లక్ష వ్యయంతో నిర్వహింప బడతాయి.

### పాఠశాలల, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మతులు.

ఆంధ్ర ప్రాంతంలోని సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ అజ్మాయిషీ క్రిందగల సబ్సిడీ పొందే హాస్టళ్లు అద్దె భవనాలలో నెలకొల్ప బడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు సబ్సిడీపొందే హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్ట బడింది. 1959-60లో 25 పాఠశాలభవనాల నిర్మాణం కోసం రు. 1.00 లక్ష మొత్తం కేటాయించబడింది. అందులో 2 భవనాలు రు. 0.10 లక్ష వ్యయంతో ఈ జిల్లాలోనిర్మించ బడతాయి.

## పారిశుధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలను ఆరోగ్యకరంగా చేయటానికి బాటలు, మరుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటుచేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959–60లో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 20 బావులు యీ జిల్లాలో రు. 0.40 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ల స్థలాల సేకరణ

ఈ పథకంక్రింద ఇళ్ల స్థలాలను సేకరించి వాటినిఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించటంకోసం దానివల్ల కలిగే అనర్థకాలను గురించి ప్రచారం చేయడానికి, వీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వటానికి, పత్రికలకు సబ్సిడీలు ఇవ్వటానికి, పోస్టర్లు, కరపత్రాలను ముద్రించటానికి, హరిజన దినోత్సవాలు వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలు పరచటంకోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్డ్ ఆఫ్ సర్వీసు రెడ్‌క్రాస్ సొసైటీ, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు హరిజనోద్ధరణకు పాటుపడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను 1959—60

ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలుకూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహనిర్మాణ పథకం

హరిజనులు ఎంత బీదవారంటే వారికి యిళ్ల స్థలాలను ఉచితంగా యిచ్చినప్పటికీ యిళ్లు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో ఉన్నారు. ఇందువల్ల హరిజనులు యిళ్లు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఒక్కొక్క యింటికి రు. 750లు ధన సహాయం చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను, రు. 500 లు ఋణంగాను ఇవ్వడం జరుగుతుంది. అయితే యీ సౌకర్యం పొందే ప్రతివ్యక్తి కొంత లేబరుని, సామాగ్రిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. వాటివిలువ పై మొత్తంలో చేరదు. హరిజనులతోకలిసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించేనిమిత్తం, నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్లు వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేకించబడుతున్నాయి. ఈ జిల్లాలో 64 యిళ్లను నిర్మించటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48 లక్ష కేటాయించబడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడినతరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వటంకోసం రాజ్యప్రభుత్వంవారు ఏటా రు. 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్ర ప్రాంతంలోని వివిధ పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా యింకా 920 స్కాలరుషిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడినతరగతుల విద్యార్థులకుకూడ యీ స్కాలరుషిప్పులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు సబ్సిడైజుడు హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుతున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున యీ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకుకూడ యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు మధ్యాహ్న భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహింపబడుతున్న పాఠశాలలలో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకుగాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడిననాటినుండి సాంఘిక సంక్షేమశాఖ పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయబడింది. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0.50 లక్ష ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకుకూడ యిందుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతులకు చెందిన పిల్లల తలిదండ్రులు తమ పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగచేసే స్థితిలో లేనందువల్ల యీ పిల్లలు పాఠశాలలకు హాజరు కారు. ఇందువల్లయీ పిల్లలకు పుస్తకాలు, పలకలు మొదలగునవి సరఫరా చేయటానికి, స్కాలరు షిప్పులు మంజూరుచేయడానికి, యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్త జాతులవారికోసం నిర్మించబడిన కాలనీలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను రెండు రేడియో సెట్లను

నిర్వహించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని విముక్తజాతులకు చెందిన పిల్లలకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## గృహనిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాస గృహాలను నిర్మించుకోవటానికి యీ పథకంక్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100 లు విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్లనే వారు మరమ్మతు చేసికోదలచినట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30 లు నగదు రూపంలో చెల్లించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 క్రొత్త యిళ్ల నిర్మాణానికి, 100 పాత యిళ్ల మరమ్మతుకుగాను రు. 0.130 లక్ష కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

ఈ జిల్లాలో రెండు క్రొత్తబావులను త్రవ్వటానికి, రెండు మరుగుదొడ్లను నిర్మించటానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.065లక్ష కేటాయించబడింది.

## వ్యవసాయం చేసుకోవటానికి సహాయం

ఈ పథకంక్రింద విముక్తజాతులవారికి ఆర్థికంగా సహాయపడేటందుకు, వారిని వ్యవసాయంలో స్థిరపరచేటందుకుగాను వారికి కాడి ఎద్దులను సరఫరా చేయటానికి, పంపుసెట్లను నెలకొల్పటానికి, పాత బావులు మొదలయినవాటికి మరమ్మతులు చేయటానికి ప్రతిపాదించబడింది. ఈ జిల్లాకు 3 జతల కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 900 లు కేటాయించబడినాయి.

## కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం యీ పథకంక్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు,

ముడిపదార్థాల రూపంలో ప్రతివ్యక్తికి రు. 50ల వరకు యీ సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 1,750/-లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఇందుమూలంగా 35 మందికి లాభం చేకూరుతుంది.

## వైద్య సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50మంది వ్యక్తులకు "డిస్‌క్రిషనరీ" గ్రాంటులు యివ్వబడతాయి. పై వ్యక్తులు తమకు కావలసిన మందులనుకొనుక్కోవటానికి, యితరఖర్చులకుగాను ఒక్కొక్కరికి రు. 40/-లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 240 లు యీజిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్త జాతులకుచెందిన ఆరుగురికి "డిస్‌క్రిషనరీ" గ్రాంటులు యివ్వటం కోసంయీ డబ్బు వినియోగించబడుతుంది.

# స్త్రీ సంక్షేమం

## సేవా సదనాలను ప్రారంభించటం

అనంతపురంలో ఒక సేవా సదనాన్ని 1959—60 లో ఏర్పాటు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.743 లక్ష కేటాయించబడింది. 100 మంది స్త్రీలు, 40 మంది పిల్లలు యీ సేవా సదనంలో చేర్చుకోబడతారని ఆశింప బడుతున్నది.

గౌరవ నీయులై బీద కుటుంబాలకు చెందిన వితంతువులకు, అనాథలు, భర్తృ పరిత్యక్తలకు సహాయం, రక్షణ యీ సేవా సదనాలు కలుగ చేస్తాయి. అభ్యర్థులను చేర్చుకోవడానికి ముందు వారిని గురించి ఫీల్డు సిబ్బంది తగు విచారణ జరుపుతారు. సేవా సదనాల్లో వారు మూడు సంవత్సరాల పాటు ఉంటారు. వారు సేవా సదనంలో ఉండేకాలంలో వారికి వైద్య సహాయం, రక్షణ కల్పించటమేగాక ఇ.ఎస్.ఎల్.సి వరకు విద్యగరప బడుతుంది వీరిలో

తెలివితేటలు గలవారికి మెట్రిక్యులేషన్ వరకు విద్య చెప్పించబడుతుంది. ఇందువల్ల వారు సాంకేతిక శిక్షణ కోర్సులను లేక పాఠశాల ఉపాధ్యాయుల శిక్షణ కోర్సు, నర్సింగ్ శిక్షణ కోర్సు, హస్తకళలు మొదలయినటువంటి వృత్తి విద్యా కోర్సులను చదివి తమ జీవన భృతిని తామే సంపాదించుకొంటూ స్వతంత్ర జీవనం గడపటానికి వీలు చేకూరుతుంది.

## వృత్తి విద్యా శిక్షణ కేంద్రాలు

విద్యావంతులయికూడ నిరుద్యోగులుగానున్న తక్కువ ఆదాయం వచ్చే తరగతి కుటుంబాలకు చెందిన బాలికలకు సహాయం చేయుటంకోసం 1958—59 సంవత్సరంలో యీ జిల్లాలోనిఅనంతపురం లో వృత్తి విద్యా శిక్షణ కేంద్రం ఒకటి ఏర్పాటు చేయబడింది. ఇందులో టైపురైటింగు, షార్టుహ్యాండు, బుక్-కీపింగు, అకౌంటెన్సీ, సెక్రటేరియల్ కోర్సులలో శిక్షణ యివ్వబడుతుంది. ఈ కేంద్రాన్ని కొనసాగించటానికి, 30 మంది అభ్యర్థులను చేర్చుకోవటానికి అభ్యర్థులు చేరటానికివచ్చేపక్షంలో యింకా ఎక్కువమందిని చేర్చుకోవటానికి గాను 1959—60 సంవత్సరానికి రు. 0·156 లక్ష కేటాయించ బడింది.

## పునరావాస కార్యక్రమం— వృద్ధులకు, అవిటి వారికి సహాయం

సేవా సదనాలనుండి డిస్‌చార్జి చేయబడిన స్త్రీలలో కొంతమందికి సహాయం చేయటానికి ఈ పథకం తలపెట్టబడింది. వారు అభ్యసించిన వృత్తి పనిని స్వంతగా కొనసాగించుకొని జీవనోపాధి చేయటానికి వారికి నిర్వహణ మూలధనం సమకూర్చబడుతుంది. ఏ ఆధారం లేకుండా ఉన్నటువంటి వృద్ధులు, అవిటివారయిన స్త్రీలకు యీ పథకం క్రింద ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఈ పథకం అమలుపరచటంకోసం యీ జిల్లాకు 1959—60 ఈ సంవత్సరానికి రు. 0.05 లక్ష కేటాయించబడింది. ఈ పథకం మూలంగా 10 మంది స్త్రీలకు లాభం చేకూరుతుందని ఆశించబడుతున్నది.

## ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమ శాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమ శాఖ కార్యక్రమాలను తీవ్రతరం చేయటానికి, మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ

రాలు, సౌండు ప్రొజెక్టర్లు, విద్యా బోధన పటాలు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు, కుట్టు మిషనులు మొదలయినటువంటి పరికరాలను, ఇతర ముఖ్య సామగ్రిని అంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీసంక్షేమశాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరాచేయటానికి ప్రతిపాదింపబడింది. ఇందులోరు. 900 లు యీ జిల్లాకు కేటాయించబడినాయి.

# సాంఘిక సంక్షేమం

## సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ప్రస్తుతమున్న 3 సంక్షేమ విస్తరణ కేంద్రాలను. కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్ సంక్షేమవిస్తరణ కేంద్రాన్ని నిర్వహించటానికి, ఈ జిల్లాలోని మొదటిదశ బ్లాకుల్లో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్ పద్ధతిని మరొక ప్రాజెక్టు ప్రారంభించడానికి రాష్ట్ర ప్రభుత్వంవాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరం రు. 0.642 లక్ష మొత్తం కేటాయించబడింది. వీటికి ఆయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమ బోర్డు, రాష్ట్రప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుంచిసేకరించే మాచింగు విరాళాలు కూడ ఇందుకు తోడవుతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం రాష్ట్రస్థాయిలో ఒకసదనాన్ని, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (3 పురుషులకు, 11 స్త్రీలకు) ప్రారంభించడానికి, ఇంతేకాక రాష్ట్రంలో యిదివరకే నెలకొల్పబడిన రాష్ట్రస్థాయి సదనాలను, జిల్లా ఆశ్రయకేంద్రాలను కొనసాగించేటందుకు ఆయ్యేఖర్చులో రాష్ట్ర ప్రభుత్వంవాటాక్రింద 1959-60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందు రు. 0.141లో లక్ష యీజిల్లాకు ప్రత్యేకించబడింది. అనంతపురంలో పురుషులకుగాను నెలకొల్పబడిన ఒక జిల్లా ఆశ్రయ కేంద్రం కొనసాగింపుకు పై డబ్బు వినియోగించ బడుతుంది.

# మునిసిపలు రోడ్లు, అభివృద్ధి పనులు

మున్సిపాలిటీల, రెండుపట్టణ పంచాయతీలయొక్క ఆదాయమార్గాలను అభివృద్ధిపరచే ఉద్దేశంతోను, స్థానిక ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలగ

చేసే ఉద్దేశంతోను రెండవ ప్రణాళికలో రు. 47.54 లక్షల మొత్తం కేటాయించ బడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం కలుగజేయడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది. ఇందులో రు. 21.42 లక్షలు మొదటి మూడుసంవత్స రాలలో ఖర్చుచేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 11.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.15 లక్ష మొత్తం 1958—59లో టౌను ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించ బడుతుంది. మిగిలిన రు. 11.44లక్షలలోను, రు. 0.40 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఋణం మొత్తం, స్థానికసంస్థ పేరు, పని వివరం ఈ దిగువ తెలుప బడ్డాయి.

| స్థానికసంస్థపేరు | పని వివరము | అప్పు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| గుంతకల్లు పురపాలకసంఘం | బళ్ళు, బస్సు స్టాండులలో షెల్టర్ల నిర్మాణం | 0.20 |
| కదిరిపంచాయతి | గ్రామాల మధ్యఉన్న రోడ్లకు అభివృద్ధి పనులు, క్రొత్త వాటిని వేయటం. | 0.20 |
| | మొత్తం | 0.40 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియోసెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 440 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదించబడింది. ఇందులో 227 సెట్లుమాత్రం 1956—59 సంవత్సరాల కాలంలో యీ జిల్లాలో నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 90 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్ప

టానికి, 1.4.1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లనూ నిర్వహించ డానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.317 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణసహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలనుగురించి ప్రచారంచేయటం కోసం 1956—57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించ టానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 20,319 లు యీ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించ బడతాయి.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంట్లు, యితర సిబ్బందికి జీతాలు .... | 8,029 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, యితర ఖర్చులకు... ... | 2,400 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు ... | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటుచేయడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళికా వారోత్సవాలు ఏర్పాటు చేయటానికి ... | 900 |
| 6. | జిల్లాలో పనిచేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు. .... | 2,280 |

| | | | |
|---|---|---|---|
| 7. | సంచార వ్యానులకు పరికరాలు | ... | 5,000 |
| 8. | ప్రస్తుతమున్న పబ్లిక్ గ్రంథాలయాలలో పైలట్ ప్రతిపాదికపై సమాచారం కేంద్రాలను నిర్వహించటం | — | 960 |
| | మొత్తం | | 20,319 |

# అర్థగణాంకశాఖ

1959—60 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడుతుంది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజనుగుమాస్తా, ఇద్దరు జవానులు యిందులో నియమించబడతారు. జిల్లాస్థాయిలో రాజ్యంయొక్క గణాంక సేకరణ కార్యక్రమాలను సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్టుచేయటానికి "లయజన్ ఏజెన్సీ"గా జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకోసం 1959—60 ప్రణాళికలో రు. 0.10 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

# తంతి తపాలా సౌకర్యాలు

1959—60 లో 53 తపాలా ఆఫీసులను ప్రారంభించటానికి, యింతే కాక రెండు (సంయుక్త) తంతి కార్యాలయాలను బుక్క పట్టణంలోను, దాడి తోటలోను ప్రారంభించటానికి ప్రతిపాదింపబడింది. కదిరి, గుత్తి, ఉరవ కొండలలో టెలిఫోను ఎక్స్ఛేంజీలను నెలకొల్పటానికి, కల్యాణ దుర్గం, మడకసిర, పావగడలలో పబ్లిక్ కాల్ ఆఫీసులను ప్రారంభించటానికికూడ ప్రతిపాదింపబడింది.

# రైలుమార్గాలు

అనంతపురం జిల్లాలో రైలు మార్గాలకు సంబధించి ఈ క్రింది పనులు 1959—60 లో అమలు జరపబడతాయి.

| | | |
|---|---|---|
| 1. | గుంతకల్లు— ధర్మవరం — కట్పాడి సెక్షను— లైను కెపాసిటి పనులు—క్రింది స్టేషన్ల మధ్యక్రాసింగు స్టేషన్లను నెలకొల్పటం. | |
| | (i) గూలపాళ్యెం మరియు ఖాదరుపేట (వెంకటపల్లి—సగంమార్చటం) | |
| | (ii) జంగాలపల్లి— ధర్మవరం (చిగిచెర్ల— సగం మార్చటం) .... | 688 |
| 2. | హాస్పేట్— గుంతకల్లు— రేణిగుంటసెక్షను. రవాణాను ఎక్కువచేసేటందుకు 26 స్టేషన్లలో అదనపుసౌకర్యాలను కలిగించటం | 12,733 |

# అనంతపురం జిల్లా ప్రణాళిక, అభివృద్ధిసంఘం సభ్యుల జాబితా

## అధికార సభ్యులు

| | | |
|---|---|---|
| జిల్లాకలెక్టరు | — | అధ్యక్షుడు |
| జిల్లా ప్లానింగు ఆఫీసరు | — | కార్యదర్శి |

1. జిల్లా వ్యవసాయశాఖాధికారి, అనంతపురం
2. జిల్లా విద్యాశాఖాధికారి, అనంతపురం
3. జిల్లా పశువైద్యాశాఖాధికారి, అనంతపురం
4. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, అనంతపురం
5. జిల్లా పంచాయతి ఆఫీసరు, అనంతపురం

6. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, అనంతపురం
7. సహకార సంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, హిందూపురం
8. ఎక్జిక్యూటివ్ ఇంజనీర్ (పి.డబ్ల్యు.డి.), అనంతపురం
9. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (విద్యుచ్ఛక్తి) గుంతకల్లు
10. డివిజనల్ ఇంజనీరు (రహదార్లు) అనంతపురం
11. పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, అనంతపురం
12. ఫిషరీస్ అసిస్టెంటు డైరెక్టరు, అనంతపురం
13. అనంతపురం జిల్లా బోర్డు స్పెషలు ఆఫీసరు యొక్క పర్సనల్ అసిస్టెంటు
14. జిల్లా వైద్యశాఖాధికారి, అనంతపురం
15. పోలీస్ సూపరింటెండెంటు, అనంతపురం
16. స్పెషల్ డిప్యూటి కలెక్టరు (ఎల్.ఎ.) అనంతపురం
17. డివిజనల్ ఇంజనీరు (ఇ) అనంతపురం
18. అసిస్టెంటు ఇంజనీరు, ఎన్. ఆర్. డబ్ల్యు. ఎస్., తలుపుల
19. అసిస్టెంటు ఇంజనీరు, ఎన్. ఇర్. డబ్ల్యు. ఎస్., కదిరి
20. అసిస్టెంటు రేడియో ఇంజనీరు, కర్నూలు
21. అసిస్టెంటు ఇంజనీర్, ప్లానింగు, అనంతపురం
22. అసిస్టెంటు ఉమన్ వెల్‌ఫేర్ ఆఫీసరు, అనంతపురం
23. ప్రాంతీయ రవాణా శాఖాధికారి, అనంతపురం
24. జిల్లా అటవీశాఖాధికారి, అనంతపురం
25. సబ్ కలెక్టరు, పెనుకొండ
26. రెవెన్యూ డివిజనల్ ఆఫీసరు, అనంతపురం
27. ,, ,, ధర్మవరం
28. శిక్షణ పొందుతున్న అసిస్టెంటు కలెక్టరు, అనంతపురం

29. కేంద్ర ప్రభుత్వం తరపున శిక్షణ పొందుతున్నవారు, అనంతపురం.
30. జిల్లా గణాంక శాఖాధికారి, అనంతపురం
31. బ్లాక్ డెవలప్‌మెంట్ అఫీసరు, కొడిగేనహాళ్ళి
32. ,, మడకసిర
33. ,, పెనుకొండ
34. ,, గోరంట్ల
35. ,, తలుపుల
36. ,, ముదిగుబ్బ
37. ,, తనకల్లు
38. ,, రోళ్ళ
39. ,, చెన్నేకొత్తపల్లి
40. ,, కంబదూరు
41. ,, రాయదుర్గం
42. ,, ఉరవకొండ
43. ,, పుట్లూరు
44. ,, సింగనమల
45. ,, కూడేరు
46. పబ్లిసిటీ అసిస్టెంటు, అనంతపురం
47. జిల్లా ఆర్గనైజరు, ఎన్.ఎస్.ఎస్. అనంతపురం
48. జిల్లా సంక్షేమ శాఖాధికారి, అనంతపురం
49. అదనపు జిల్లా సంక్షేమ శాఖాధికారి, అనంతపురం
50. ప్రత్యేక జిల్లావిద్యాశాఖాధికారి, అనంతపురం
51. అసిస్టెంటు ఇంజనీరు (భూసంరక్షణ) అనంతపురం
52. సీనియర్ ఎంటమాలజిస్టు, అనంతపురం

53. అసిస్టెంటు రేడియోఇంజనీరు, అనంతపురం

## అనధికారసభ్యులు

1. శ్రీ ఎస్. నారాయణప్ప, ఎం.ఎల్.ఎ., ఉరవకొండ
2. శ్రీ సి. సుబ్బరాయుడు, ఎం.ఎల్.ఎ., తాడిపత్రి
3. శ్రీ కె. శాంతప్ప, ఎం.ఎల్.ఎ., కంబదూరు
4. శ్రీ కె. వి. వేమారెడ్డి, ఎం.ఎల్.ఎ., అనంతపురం
5. శ్రీ కె. సుబ్బరావు, ఎం.ఎల్.ఎ., హిందూపురం
6. శ్రీ పి. ఆంథోనిరెడ్డి, ఎం.ఎల్.ఎ., అనంతపురం, పడమటి యాలేరు
7. శ్రీ టి. రామచంద్రారెడ్డి, ఎం.ఎల్.ఎ., తరిమెల
8. శ్రీ ఎం రాజారాం, ఎం.ఎల్.ఎ., గుంతకల్లు
9. శ్రీ ఎన్. సి. శేషాద్రి, ఎం.ఎల్.ఎ., రాయదుర్గం
10. శ్రీ పి. వెంకటరమణప్ప, ఎం.ఎల్.ఎ., గుంతకల్లు
11. శ్రీ పి. రామాచార్లు, ఎం.ఎల్.ఎ., అనంతపురం
12. శ్రీ పి. బైపరెడ్డి, ఎం.ఎల్.ఎ., పాముదుర్తి
13. శ్రీమతి బి. రుక్మిణీదేవి, ఎం.ఎల్.ఎ., మడకసిర
14. శ్రీ ఎ. చితంబరరెడ్డి, ఎం.ఎల్.ఎ., పెదబల్లి

## అధినకారసభ్యులు—పార్లమెంటుసభ్యులు

15. శ్రీ టి. నాగిరెడ్డి, అనంతపురం
16. శ్రీ కె. వి. రామకృష్ణారెడ్డి, కదిరి (కొండవండ్లపల్లి)

## విధానమండలి సభ్యులు

17. శ్రీ జె. సి. నాగిరెడ్డి

18. ,, కె షర్ఫుద్దీన్
19. ,, ఐ. సదాసివన్

## ఇతర సభ్యులు

20. తాడిపత్రి పురపాలకసంఘం అధ్యక్షుడు
21. అనంతపురం పురపాలకసంఘం అధ్యక్షుడు
22. గుంత కల్లు పురపాలకసంఘం అధ్యక్షుడు
23. హిందూపురం పురపాలకసంఘం అధ్యక్షుడు
24. డాక్టరు డి. వి. రామచంద్రారెడ్డి, కదిరి
25. శ్రీ జి. వెంకటరెడ్డి, అనంతపురం
26. ,, ఎం. మల్లిరెడ్డి, అనంతపురం
27. ,, పి. వి. చౌదరి, నూతిమడుగుల
28. ,, జి. ఆర్. లింగం, గుంతకల్లు
29. ,, ఎల్. వెంకటనారాయణప్ప, లేపాక్షి
30. ,, కె. రామచంద్రయ్య, పెనుకొండ
31. ,, ఎస్. హరిదాస్, అనంతపురం
32. ,, బి. వేణుగోపాలరావు, కూడేరు
33. ,, దొంతి భీమయ్య సెట్టి, హిందూపురం
34. ,, కె. రామకృష్ణారెడ్డి, చౌలూరు
35. ,, జి. రామాశాస్త్రి, మడకసిర
36. ,, ఐ. ఓబయ్య, కంబదూరు
37. శ్రీమతి ఎల్. రామమూర్తి
38. శ్రీ పి. హనుమంతప్ప, గుంతకల్లు
39. ,, ఎ. రామప్ప, అనంతపురం
40. ,, ఎన్. శివశంకరం, అనంతపురం